# సత్యవేద చరిత్ర సంగ్రహము.



. ఈ. షుగ్రెను చే



రచియింపబడినది.

---

# AN OLD TESTAMENT HISTORY

---

BY

*ERIK O. SCHUGREN.*

---

S. K. P. PRESS, BAPATLA.

1910.

Sathiavedhacharithra Sangrahamu

# సత్యవేద చరిత్ర సంగ్రహము

ఈరిక్. ఓ. షుగ్రెన్ చే

రచియింపబడినది.

# AN OLD TESTAMENT HISTORY

BY

*ERIK O. SCHUGREN.*

S. K. P. PRESS, BAPATLA.

1910.

# మొదటి ప్రకరణము

# సృష్ట్యారంభమునుండి జల ప్రవాహముదాక.

ఆదామునుండి జలప్రవాహముదాక షుమారుగా

1656 సంవత్సరములు.

## — I —

## సృష్టి

ఆదియందు యెహోవ యాకాశములనున్ను భూమినిన్ని సృష్టించెను. అప్పుడు భూమి నిరాకారముగాను శూన్యముగా నుండెను. యెహోవ ఆత్మనీళ్లపైని అల్లాడుచుండెను.

1. యెహోవ వెలుగు కలుగుగాక యని పలికినప్పుడు వెలుగు కలిగెను. వెలుగును చీకటిని వేరుపరచి వెలుగునకు పగలనియు చీకటికి రాత్రి యనియు పేరుపెట్టెను. మొదటి దినమందు యెహోవ చేసిన కార్యమిదే.

2. రెండవదినమున యెహోవా క్రిందనీళ్లను మీదనీళ్లను వేరుపరచుటకై నొకవిశాలము కలుగుగాక యని పలికెను. యాప్రకారమాయెను. యావిశాలమునకు యెహోవా యాకాశమని పేరు పెట్టెను.

3. మూడవదినమున ఆరినభూమికనబడువట్లు యాకాశముక్రింద నీళ్లనొకచోటనే కూర్చబడునుగాకని యెహోవా పలికినప్పుడా ప్రకారముగా జరిగెను. అప్పుడు యెహోవా యెండిననేలకు భూమియనిన్ని నీళ్లరాశికి సముద్రమనిన్ని పేరిచ్చెను, విత్తనములను చెట్లను మొదలయిన భూమిమొలకలను తమతమ జాతిప్రకారము యెహోవా యాదినమందు మొలిపించెను.

4. నాలుగవ దినమందు యెహోవా యాకాశవిశాలమందు వెలుగుకలుగుగాకయనెను. మరియు పగటియందు ప్రకాశించుటకు సూర్యునిన్ని రాత్రియందు వెలుగిచ్చుటకు చంద్రునిన్ని నక్షత్రములనున్ను యెహోవా యాదినమున సృజించెను.

5. అయిదవ దినమందు యెహోవా సముద్రములయందున్న మహాజంతువులనున్ను యాకాశముక్రిందుండెడు రెక్కలుగలపక్షులనున్ను కలుగజేసెను.

6. ఆరవదినమున యెహోవాచేసిన కార్యములేవనగా:—

(a) అడవి మృగములనున్ను, పశువులనున్ను, భూమిమీదప్రాకు పురుగులనున్ను వాటివాటి జాతిప్రకారముగా యెహోవా సృజించెను.

(b) చివరకు తన స్వరూపమందు తన పోలిక చొప్పున యెహోవా నరుని సృష్టించెను. అదియెట్లనగా:— నేలధూళితో ఆయనను నిర్మించి అతని నాసికారంధ్రములలో జీవవాయువును యూదెను. అప్పుడు నరుడు జీవాత్మ ఆయెను. మరియు యెహోవా అతనికి ఆదామను పేరు పెట్టెను.

(c) యెహోవా ఏదెనునొకతోటనేర్పరచి తానునిర్మించిన నరుని దానిలోనుంచెను. చూపునకు రమ్యమయినదిని యాహారమునకు మంచిదైన ప్రతివృక్షమును యాతోటమధ్య సజీవవృక్షమును, మేలు కీడుల తెలివి వృక్షమును నేలనుండి యెహోవా మొలపజేసెను.

దానినుపయోగించుటకును, కాపాడుటకును యెహోవాయాతోటనరుని కప్పగించి సెలవిచ్చిన దేమనగా:— యీ తోటలోనుండు ప్రతివృక్షఫలములను నీవు తినవచ్చును అయితే మేలుకీడుల తెలివి వృక్షఫలములను నీవు తినవద్దు. నీవు వాటిని తినుదినమున చచ్చెదవు.

(d) మరియు యెహోవా—నరుడు ఒంటరిగానుండుటకు మంచిది కాదు. వానికి పాటియయిన సహాయమును వానికొరకు చేయుదుననుకొనెను. అప్పుడు యెహోవా ఆదాముకు గాఢ నిద్ర కలుగజేసి అతడు నిద్రించినప్పుడతని ప్రక్కటెముకలలో

ఒకదానితీసుకొని దాని స్త్రీనిగానిర్మించి యామెను ఆదాము కప్పగించెను. అతడామెను చూచియిట్లనెను: యీమెనా యెముకలలోనుండి యెముకయు నామాంసములోనుండి మాంసమునై యున్నది. నరునిలోనుండి తీయబడెను గనుకయామె నారియని అనబడును. తరువాత ఆదాము యామెకుహవ్వ యని పేరుపెట్టెను.

"కాబట్టి పురుషుడు తనతండ్రిని తనతల్లిని విడిచి తన భార్యను హత్తుకొనును. వారు ఏకశరీరమై యుందురు."

7. ఏడవదినమున తనపనియంతటనుండి యెహోవా విశ్రమించెను గనుక ఆయన యాదినము నాశీర్వదించిపరిశుద్ధపరచెను.

(ఆదికా. 1, 2.)

## — II —

## నరులు సాతానుయొక్క శోధనకు లొంగిపోవుట

1. యెహోవా కలుగజేసిన సమస్త భూజంతువులలో సర్పము కపట ముగలదియైయుండెను. (ఆదికా. 3.)

సాతానుయను పడిపోయిన నొకదుష్టదూతసర్పరూపమయివచ్చి నరులను శోధించుచు చెప్పినదేమనగా: యిదినిజమా—యీ తోట వృక్షములలో దేనిఫలములనైనను మీరుతినకూడదని యెహోవ చెప్పెనా?

అందుకుహవ్వ ఈతోట చెట్లఫలములను తినవచ్చునుగాని తోట మధ్యనున్న చెట్టుఫలములనుమాత్రము మేముచావకుండునట్లు తినకూడదని యెహోవ మాకు సెలవిచ్చియున్నాడని యాచెడిపోయిన దూతకు ప్రత్యుత్తరమిచ్చెను. వాడు—అట్లనరాదు మీరుచావనే చావరు. మీరువాటిని తినుదినమున మీకన్నులు తెరవబడునని యు మీరు మేలుకీడులను ఎరిగినవారయి దేవతలవలె నుందురని యు యామెకు జెప్పియుండెను.

2. హవ్వయావృక్షఫలముయాహారమునకుమంచిదనియుకన్నులకింపమైనదనియు వివేకమిచ్చు రమ్యవృక్షఫలమునై యుండుటచూచిన ప్పుడాఫలములలోగొన్ని తీసుకొనితిని తనపెనిమిటికికూడ కొన్ని యిచ్చెను. అయన వాటిని తినెను.

అప్పుడు వారిద్దరికన్నులు తెరువబడి వారుతాముదిగంబరులమని తెలుసుకొని యంజూరపు ఆకులు కూర్చుకొని మొలచుట్లు కట్టు కొనిరి.

3. సాయంకాలమైనప్పుడు ఆదామును అతనిభార్యను యెహోవ శబ్దము వినిరి. గనుకవారు భయపడి తోటచెట్లనడుమునాయనసన్ని ధినుండి దాగిరి. అప్పుడు యెహోవ నీవు యెక్కడనున్నావని

ఆదామును పిలిచెను. అందుకతడు నీ శబ్దము వింటిని. దిగంబరినై
యున్నందున భయపడి దాగితి ననెను. యెహోవా యిట్లనెను.
దిగంబరివని నీకు దెలిపినవాడెవడు. నేను నిషేధించిన వృక్షఫలము
లను తినియున్నావా? అందుకు ఆదాము నాయొద్దనుండుటకు నీవు
నాకుయిచ్చిన యీ స్త్రీయే కొన్ని నాకు యిచ్చెను తిన్నాననెను.
అప్పుడు యెహోవా స్త్రీని చూచి నీవు చేసిన దేమిటని ఆమెనడుగ
గా యామె సర్పము నన్ను మోసపరచెననెను.

4 యెహోవా తీర్పు విధించుట.

(a) అప్పుడు యెహోవా సర్పముతో నీవుయీ మోసము చేసినందున
భూజంతువులన్నిటిలో నీవు శపింప బడుదువుగాక, "నీకును
స్త్రీకిని నీసంతానమునకును యామె సంతానము
నకును వైరము కలుగజేసెదను. ఆయన నీతల
మీద త్రొక్కి దానినినలిపివేయును నీవు అతని
మడెమమీద కరతువనెను."

(b) స్త్రీని చూచి ఆమెతో నీ ప్రసూతి వేదనను మిక్కిలిగా హె
చ్చించెదను ప్రయాసముతోను వేదనతోను పిల్లలను కందువు.
నీ పెనిమిటి నిన్ను ఏలును గాక యనెను.

(c) మరియు ఆదాముతో నీ నిమిత్తము నేల శపింపబడియున్నది.
నీ జీవిత దినములన్నిట ప్రయాసముతోనే దాని పంటతిందువు
అది ముండ్ల పొదలను రక్కసి చెట్లను నీకు మొలిపించును.

నీవు నేలకు తిరిగి చేరుపర్యంతము నీ ముఖము యొక్క చెమటవలన ఆహారము తిందువు నేలనుండి తీయబడితివి నీవు మన్ను, తిరిగి మన్నై పోదువనెను.

(d) యెహోవ ఆదామును అతని భార్యను ఏదేను నుండి వెళ్లగొట్టి మండుచు ఇటు నటు తిరుగుచున్న ఖడ్గముతో దాని కాచుటకై చెరూబులను దూతల నచ్చట నుంచెను.

ఆదికా. 3.

# —III—

## కయీను, హేబేలు, షేతు

1. ఆదాము యొక్క పుత్రులలో కయీను జ్యేష్ఠుడు. అయన వ్యవసాయకుడాయెను. హేబేలు గొర్రెల కాపరి. కయీను దుర్మార్గుడు, హేబేలు భయభక్తుడు. ఒకనాడు వారిద్దరు యెహోవకు కానుకలిచ్చిరి. కయీను తన పొలముల పంటలో నుండి కొంత తెచ్చెను. హేబేలు తన మందలోనుండి తొలుచూలు పుట్టిన క్రొవ్విన వాటిలో కొన్నిటిని తెచ్చెను. వారు వాటిని సమర్పించుచుండగా యెహోవ హేబేలును అతని కానుకను అంగీకరించెను. గాని కయీనును అతని కానుకలను అంగీకరించలేదు.

2. అప్పుడు కయీనుకు మిక్కిలి ఆగ్రహము పుట్టెను: కాబట్టి యెహోవ అతనిని చూచి యిట్లనెను. నీకు కోపమేల ! నీ

తల యేలవంచియున్నది. నీవు సత్క్రియ చేయని యెడల నీమన
స్సాక్షి నిన్ను గద్దించును సత్క్రియ చేసిన యెడల సంతోషము
గాంచెదవు. వాకిట పాపము పొంచి యున్నది. నీయెడల
దానికి వాంఛ కలుగును నీవు దాని నేలవలెను.

3. ఒకనాడు వారిద్దరు పొలములోనున్నప్పుడు కయీను తన తమ్ముడ
యిన హేబేలుకు విరోధముగా లేచి అయనను చంపెను. గను
క యెహోవ కయీనును చూచి నీతమ్ముడయిన హేబేలుయెక్క
డ నున్నాడని అతని నడుగగా అతని నేనెరుగను నాతమ్మునికి
నేను కావలివాడనా యనెను. అందుకు యెహోవ యిట్లనెను.
నీవు చేసినపని యేమిటి ? నీతమ్ముని రక్తము యొక్క స్వరము నే
లలోనుండి నాకు మొరబెట్టుచున్నది. నీవు శపింప బడిన వాడ
వు నీవు నేలను సేద్యపరుచునప్పుడు అది తన సారము నికమీ
దట నీకియ్యదు. నీవు భూమిమీద దిగులుపడుచు దేశ దిమ్మరివై
యుందువు. కయీను యీమాటలువిని అయన అయ్యో నా అ
క్రమము నేను భరించలేనంత గొప్పదని మొరబెట్టి యెహోవ స
న్నిధి లోనుండి వెళ్ళిపోయెను.

4. ఆదాము నూటముప్పదియేండ్ల వయస్సుగలవాడయినప్పుడొక కు
మారుడాయనకు పుట్టెను. అకుమారునికి షేతు యనే పేరు పెట్టిరి.
యీషేతు యొక్క సంతానము నుండి నోవహు అనువాడు
పుట్టెను.

ఆదికా. 4, 5

# — IV —

## జల ప్రవాహము

1. నరులు భూమిమీదవిస్తరింప నారంభించినప్పుడు వారి దుర్మార్గతనము కూడ విస్తరించెను. వారి చెడుతనము భూమిమీద గొప్పదాయెను. వారి హృదయతలంపుల సంకల్పము కేవలము చెడ్డదని యెహోవ చూచెను. కాబట్టి యెహోవ మనుష్యులను చూచి వారివిషయమై దుఃఖపడి మిమ్ములను నశింప జేయుదునని వారిని బెదరించెను. వారు గుణపడి తనతట్టుకు తిరిగి రాగలందులకు యెహోవ వారికి నూటయిరువది యేండ్లు తగిన సమయ మిచ్చెను. అయినను వారు మనస్సు తిప్పుకొనక పోవుట వలన వారిని భూమిమీదనుండి తుడిచివేయుటకై యెహోవ తీర్మానించెను.

2 నోవహు భయభక్తుడుగనుక ఆయనకుయెహోవ కటాక్షము కలిగెను. యెహోవ వాక్యము అతనికి వచ్చి సెలవిచ్చిన దేమనగా గోపెరు క్రలతో నీకొరకొక నావను చేసికొనుము. యెందుకనగా నేనే జీవముల యూపిరిగల సమస్తశరీరులను యాకాశము క్రిందనుండి నాశనము చేయుటకై యీ భూమిమీదికి జలప్రవాహము పంపెదను.

3 యెహోవ సెలవిచ్చినవిధములన్నిటిరీతిగా నోవహు యోడను కట్టించి వాటి వాటి జాతిప్రకారము పక్షులను పురుగులను నీళ్ళలో బ్రతుకలేని మొదలయినటువంటి మృగములను దానిమీద యెక్కిం

చెను. తరువాత తన భార్యయునున్ను తన పుత్రులయిన షేము, హా ము, యాఫేతులను వారినిన్ని వారి భార్యలతో కూడనున్ను నోవ హు యోడదరొక్కెను. అప్పుడు యెహోవ దానితలుపు మూసి వేసెను.

4. ఆదినమున మహాగాధజలముల యూటలన్నియు విడువబడెను. యాకాశ పుతూములు విప్పబడెను నలుబదిరాత్రింబగళ్లు ప్రచండవ ర్షము భూమిమీద కురిసెను. యెత్తైన మహాపర్వతములన్ని జలములచే కప్పబడినవి. సంచరించు సమస్త శరీరులకేమి నరుల కేమి ప్రాణములుబోయెను.

5. యెహోవ నోవహును అతనితో కూడ నావలోనున్న మనుష్యు లను జ్ఞాపకము చేసుకొనెను. అగాధజలములయూటలును యాకా శ పుతూములును మూయబడెను. కురియుచున్న ప్రచండవర్షము నిలుపబడెను. అప్పుడు నీళ్లు క్రమక్రమముగా తీసిపోవుచుం డెను.

6. ఏడవనెల పదిహేడవ దినమున యరారాతను పర్వతముమీద నావనిలుచుండెను. అప్పుడు నోవహునొక కాకోలమును వెలపలి కి విడిచెను. అదిబైలువెళ్లి నీళ్లు ఇంకిపోయినమట్టుకు నావను మ ళ్ళిచేరక ఇటు అటు తిరుగుచుండెను.

7. తరువాత నోవహు నొకగువ్వను వెలుపలికి విడిచెను. నీళ్లుభూ మి యంతటయున్నందున విశ్రమించుటకై దానికి స్థలముదొరకక పోవుటచే యాగువ్వనావయొద్దకు తిరిగివచ్చెను.

(a) ఏడవ దినములైన తరువాత నోవహు మళ్ళీ నొకగువ్వను బైటికి పంపెను సాయంకాలమైనప్పుడు అది త్రుంచబడిన యొక ఓలీవ యాకునుముక్కున కరచుకొని వచ్చెను.

(d) యింక ఏడుదినములు తాళుకొనినతర్వాత నోవహు మళ్ళీగువ్వను విడిచెను. అది వెగిరిపోయి నావనుమళ్ళీ చేరకపోయినందున నీళ్ళుతగ్గిపోయెనని గ్రహించినోవహు నావకప్పుచుపకదీసి భూమి యారియుండెనని చూచెను.

# రెండవ ప్రకరణము

## జల ప్రవాహమునుండి గోత్రికర్తలైన వారికాలము దాక.

## — I —

## యెహోవ నోవహుతో నిబంధన జేయుట.

యెహోవయొక్క ఆజ్ఞప్రకారము నోవహును అతనితోనున్న వారును నావదిగిరి. అప్పుడువారు నొకయజ్ఞ వేదిక కట్టి పవిత్ర జంతువులలోకొన్ని తీసుకొని యర్పితముగా యారోపింపజేసియెహోవ నామమును స్మరించిరి. అప్పుడు యెహోవ వారితో యిట

మీదట నరులనిమిత్తము నేలను శపించను. మీరు ఫలాభివృద్ధి బొంది విస్తరించి భూమిని నిండించుడి. నేను మీతో చేయు నిబంధన రీతిమనగా సమస్త శరీరులు ప్రవాహజలములవల నికను లయపరచబడరు. భూమి నాశనము చేయునట్లు యికను జలప్రవాహము కలగదని గురుతుగా ధనస్సు మేఘములతో నుంచెద ననెను.

## — II —

# యెహోవ మనుష్యుల భాష తారుమారుగా జేయుట

1. భూమి యందంతట నొక్కపలుకు నొక్క భాషయు నుండెను; మనుష్యులు తూర్పున ప్రయాణమై వెళ్ళుచుండగా షీనారు దేశ మందొక మైదానము వారికి కనబడెను. అక్కడవారు నివసించిరి. మరియువారు—జనము భూమియందంతట చెదిరి పోకుండ నొకపట్టణమును యాకాశమునంటు శిఖరముగల నొక గోపురమును కట్టుకొని మనకు పేరుకలుగజేసి కొందము రండని యొకరితో నొకరు మాట్లాడుకొనిరి.

2. మరియు వారిలో నొకని పలుకు నొకనికి తెలియకుండునట్లు యెహోవ వారిభాష తారుమారుగా చేసెను. గనుక వారు యాపట్టణమును కట్టుటమాని భూమియందంతట వ్యాపించిరి.

(a) అక్కడనే వారిభాష తారుమారుగా చేయబడినందున యాపట్టణము బాబేలనబడెను. (ఆదికా. 11)

# మూడవ ప్రకరణము.

## గోత్రకర్తల కాలము.

అబ్రాహాము మొదలుకొని మోషేను పిలువడము వరకు రమారమి 510 సంవత్సరములు (క్రీ. పూ. 2000—1490సం)

# — I —

## అబ్రాము గోత్రజనకుడగుట.

1. మెసపొతామియ దేశములో హారానను పట్టణమందు షేము యొక్క వంశస్థుడయిన అబ్రాము అను పేరుగల యొకడుండెను. యెహోవ వాక్యమాయనకు వచ్చి చెప్పిన దేమనగా: నీవు లేచి నీ దేశము నుండియు నీ తండ్రి యింటిలోనుండియు బైలుదేరి నేను నీకు చూపించబోవు దేశమునకు వెళ్ళుము. "నేను నిన్నాశీర్వదించి నిన్ను గొప్పరాష్ట్రముగా జేసెదను. నీవు యాశీర్వచనముగా నుందువు. నిన్నాశీర్వదించువారి నాశీర్వదించెదను. నిన్ను దూషించువారిని శపించెదను. భూమియొక్క సమస్తవంశములు నీద్వారయాశీర్వదింపబడును."

2. అబ్రాము తనభార్యయైన శారయిని తన సహోదరుని కుమారుడయిన లోతును తనయావదాస్తిని తీసుకొని కానాను దేశమునకు బైలుదేరెను. అప్పుడు అబ్రాము డెబ్బదియైదు సంవత్సరములు వయస్సుగలవాడు.

ఆయన షెకేమందలి యొకస్థలముదాక సంచారముచేసి మోరె దగ్గరనున్న సింధూర వృక్షమునొద్దకు జేరెను. అచ్చట యెహోవ అతనికి ప్రత్యక్షమై— "నీ సంతానమునకు యీ దేశమిచ్చెదనన్నాను.,,

యాస్థలమందు అబ్రాము యజ్ఞవేదికకట్టి యెహోవపేరట ప్రార్థించెను. తర్వాత అబ్రాము ప్రయాణమై దక్షిణదిక్కునకు వెళ్లెను.

ఆది. 11, 12.

## — II —

# అబ్రామును లోతును.

1 అబ్రాము వెండి బంగారములు పశువులు గలిగి బహుధనుడయి యుండెను. లోతుకుకూడ మంద అతి విస్తారముగా నుండెను.గనుకయిద్దరుకూడి యాస్థలమున నివసించుటకు వారికి చోటుచాలక పోయెను. వారిపశువులకాపరులకు కలహముపుట్టెను.

కాబట్టి అబ్రాము మనమన్నదమ్ములమయి యున్నాముగదా. నాకును నీకును నాపశువులకాపరులకును నీపశువులకాపరులకును కలహమెందుకు? దయచేసి నన్నువిడిచివేరుగానుండుము. నీవు యెడమతట్టుకు వెళ్ళినయెడల నేను కుడితట్టుకును నీవు కుడితట్టుకు వెళ్ళినయెడల నేనెడమ తట్టుకును వెళ్లెదననెను—గనుక లోతు యొర్దాను మైదానమంతటిని తానేర్పరచుకొనెను. యాప్రాంత్యమంత బహుసత్తువగలదై యుండెను. లోతుతనకు నేర్పరుచుకొన్న మైదానమునందు సొదొమనే యొకగొప్పపట్టణముండెను. యాపట్టణమునకు సమీపముగా లోతు తనగుడారము కట్టెను, యాపట్టణస్థులు మిక్కిలి దుర్మార్గులై యుండిరి.

2. తర్వాతయెహోవ అబ్రాముతో యిట్లనెను. "నీకన్నులెత్తి యుత్తరపుతట్టును, దక్షిణపుతట్టును, తూర్పుతట్టును పడమరతట్టును చూడుము. నీవుచూచుచున్న యీ దేశమంతటిని నీకును నీసంతానమునకును చిరకాల పర్యంతమువరకు యిచ్చెదను."

3. అప్పుడుఅబ్రాము తనగుడారములు పీకి హెబ్రోనులోనున్న మమ్రేయొక్క యలోను వనములోనివసించి అచ్చటయెహోవ నిమిత్తము యజ్ఞవేదికను కట్టెను.

ఆదికాం 13.

# — III —

# యెహోవ అబ్రాముతో చేసిన నిబంధన:

1. యెహోవ అబ్రామునకు మళ్లీప్రత్యక్షమై —అబ్రామా! భయపడకుము. నేనునీకు కేడెమును. నీబహుమాన మత్యధిక మగునని పలికెను. అందుకు అబ్రాము ప్రభువా! నేను సంతానములేనివాడనై పోవుచున్నాను. నాయింట్లోపుట్టిన నాదాసుడు నాకుబాధ్యుడగుననెను. అప్పుడుయెహోవ అబ్రాముతోనీవాకాశముతట్టు నిదానించి చూడుము. నక్షత్రములను లెక్కింపశక్తి నీకు గలిగి

యున్న యెడల వాటిని లెక్కించుము. నీ సంతాన మట్టిదగునని చెప్పెను. అబ్రాము యెహోవ చెప్పినది నమ్మెను. గనుక అతనికి ది. నీతియని యెంచబడెను.

౨. మరియు యెహోవ అబ్రాముతో నిట్లనెను: "నీ సంతాన ప్రజలు తమది కాని పరదేశమందు నన్నూరు సంవత్సరములు నివసించి దాసులయి యాపరదేశస్థుల చే హింసించబడుదురు. తర్వాత మిక్కుటమైన యాస్తితో అచ్చటనుండి వెలుపలు వెళ్లుదురు.,,

౩. అబ్రాము తొంబది తొమ్మిది యేండ్లవాడయియున్నప్పుడు యెహోవ అతనికి ప్రత్యక్షమై - నేను - సర్వశక్తిగలదేవుడను. నాసన్నిధిలో నడుచుచు నిందారహితుడవయియుండుము. నీతో నా నిబంధన నియమించి మిన్నత్యధికముగా వృద్ధిపరచెదను. నీవు రాష్ట్రముల సమూహములకు తండ్రివై యుందువు గనుక నీపేరు అబ్రాహాము యగునని చెప్పెను."

యానిబంధనకు గుర్తై యుండుటకు యెహోవ ఛేదనసంస్కారమును స్థాపించెను.

4. మరియు దేవుడు — నీభార్యయైన శారయి పేరు శారయి అనవద్దు. ఏలనగా యామె పేరు శారా. అనగా రాణి — నేనా

మెను దీవించి ఆమెవలన నీకొక కుమారునిచ్చెదను. జనములరాజు
లు ఆమెవలన కలుగుదురనెను. అబ్రాహాము యీమాటలువిని
సాగిలపడినవ్వి నూరేండ్ల వానికిసంతానముకలుగునా తొంబదియేం
డ్ల సారా కనునాయని తనమనస్సులో ననుకొనెను.

ఆదికాం. 15, 17.

# — IV —

## యెహోవా సొదొమనున్ను గొమొ ర్రానున్ను నాశము జేయుట.

మరియు యెహోవ—సొదొమ గొమొర్రాల పాపము ఘోర
మైనదై యున్నందున యీపట్టణములను నాశనము చేయబోవుచు
న్నానని అబ్రాహాముతో సెలవిచ్చెను. అందుకబ్రాహాము వి
జ్ఞాపనము చేసికొనినదేమనగా: దుష్టునితో కూడ నీతిమంతునిచంపు
టకునీకు దూరమవును గాక! యీపట్టణములో ఏబదిమంది నీతిమంతు
లుండినయెడల యీఏబదిమంది నీతిమంతులనిమిత్తమాస్థలము
ను కాపాడక దాని నాశము చేయుదువా?

సర్వలోకమునకు తీర్పుతీర్చువాడు న్యాయము చేయడా? యె
హోవ—యీపట్టణములోనాకు ఏబదిమంది నీతిమంతులు కనబడి
నపక్షమున యీస్థలమంతటిని వారినిమిత్తము కాయుదునని చెప్పె

ను. అబ్రాహాము ధూళిబూడిదనైన నేను ప్రభువుతో మాట
లాడ తెగించియున్నాను. బహుశ ఐదుగురు తక్కువైనందున
యీపట్టణమంతయు నాశనము చేయుదువా? నలుబదియైదుగు
రు కనబడుదురేని పట్టణము నాశము చేయనని యెహోవ ప్రత్యుత్త
రమిచ్చెను. చివరకు అబ్రాహాము యిట్లనెను: ప్రభువుకు కోప
మురానియ్యకుము. నేనింకొకమారే మాటలాడుదును. ఒకవేళ అ
క్కడ పదిమంది నీతిమంతులు కనబడుదురేమో అని చెప్పగా ఆయ
న—ఆపదిమందినిబట్టి పట్టణమును నాశనము చేయక యుందునె
ను. యెహోవ అబ్రాహాముతో మాటలాడుట చాలించి వెళ్లి
పోయెను.

2. యీసాయంకాలమిద్దరు దూతలు సొదమ చేరగా. లోతు వారిని
చూచి తనయింట్లో బసచేయుటకై రమ్మని వారిని పిలిచెను. వా
రాయనయింట మనవి నాలకించిరి. యీదూతలు లోతును చూచి యెహో
వ యీపట్టణము నాశము చేయబోవుచున్నాడు గనుక నీకు కలి
గినవారందరిని వెలుపటికి తీసుకొనిరమ్మనిరి. అప్పుడు లోతు తన
కూతురులతోను తన అల్లుండ్లతోను మాట్లాడి లెండి యీచోటు
విడిచివెళ్లండి యెహోవ దీనిని నాశము చేయబోవు చున్నాడనెను.
గాని అది వెగటాళిచేయునట్లుగా వారికి కనబడెను. తెల్లవారి
నప్పుడు యీదూతలు లోతును త్వర పెట్టి లెమ్ము యీపట్టణస్తులతోటి
మీరు నశించకుండ నీవారిని తీసుకొనిరమ్మని చెప్పి వారిచేతులుపట్టు
కొని వెలుపటికిచ్చి యీప్రాంతములలో యెక్కడను మీరు నశిం

చిపోకుండ మీ ప్రాణములు దక్కించుకొనునట్లు పారిపొండని చె
ప్పి లోతును, అతని వారిని సాగనంపిరి.

3. సూర్యుడుదయించినప్పుడు యెహోవ యా పాపాత్ములమీద
గంధకమును యగ్నిని కురిపించి అక్కడ నివశించినవారందరిని, నే
ల మొలకలను నాశము జేసెను.

లోతుభార్య తన వెనుక నుండి తిరిగిచూచినందున ఉప్పు స్తంభ
మాయెను.

## — V —

# యెహోవ అబ్రాహాముయొక్క విశ్వాసము పరీక్షించుట

1 అబ్రాహాము నూరు సంవత్సరముల వయస్సు గలవాడయినప్పుడు
అతని భార్యయయిన సారా తొంబది యేండ్ల ప్రాయముగలదై
యుండెను. అప్పుడు యెహోవ ముందు జెప్పిన ప్రకారము వారి
కొక కుమారుడు పుట్టెను. యాకుమారునికి యిస్సాకు యను పే
రు పెట్టిరి.

2 ఒక నాడు యెహోవ అబ్రాహాముతో నిట్లనెను. నీకొక్కడ
యియున్న నీప్రియపుత్రునితీసుకొని మోరీయ దేశమునకు వెళ్ళి అ
చ్చట నేను నీకు చూపింపబోవు పర్వతముమీద యారోహణయాగ

ముగ్గా నతని యెహోవా హింసజేయు మనగాలస్వను అబ్రాహాము లేచి
కట్టెలుచీల్చి తననౌకరులను, తనకుమారుడగు, యిస్సాకును వెంటబె
ట్టుకొని యెహోవా తనతోజెప్పినచోటికి బోయెను. మూడవ దిన
మున అబ్రాహాము తనకన్నులెత్తి దూరమునుండి యాచోటునుచూ
చి తన పనుచు వారితో: మీరిక్కడనే నిలిచియుండుడి నే
నును నాకుమారుడును అక్కడికిబోయి ఆరాధనముజేసి మీయొద్ద
కు మల్లివచ్చెదమని చెప్పి యెహోవా నాజ్ఞాపించిన కట్టెలమోపు ఈ
సాకు తలమీదనుంచి తనచేతితో నిప్పును కత్తిని పట్టుకొని వారి
ద్దరు కూడివెళ్లుచుండగా యిస్సాకు తనతండ్రితో: తండ్రి నిప్పును
కట్టెలును యున్నవిగదా. Vయినను యారోహణ యజ్ఞముకొర
కై గొర్రెపిల్లెక్కడని పలికెను. అందుకాయన: నాకుమారుడా
[illegible] గొర్రెపిల్లను మనకొరకు యెహో
వ చూచుకొనుననెను.

3. యెహోవా అతనికి చూపించిన స్థలమునకు చేరి అబ్రాహా
ము యజ్ఞవేదికకట్టి దానిమీద కట్టెలనుంచి, తనకుమారుడగు యిస్సా
కును బంధించి యజ్ఞవేదిక మీద అతనినుంచి తనకుమా
రుని సంహరించుటకై అబ్రాహాము కత్తిపట్టుకొనుచుండగా యె
హోవదూత అతనితో: అబ్రాహామా! అబ్రాహామా!! నీకుమారుని
యేమియు చేయకుము. నీవు అతనినాకీయనొల్లక యుండలేదు గ
నుక నీవు దేవునికి భయపడువాడవని నేనెరుగుదుననెను. అప్పుడు
అబ్రాహాము తనకన్నులెత్తి చూచుచుండగా వెనకపాదలో కొమ్ము
లు [illegible] చిక్కుబడినయొక పొట్టేలును చూచెను. దానిపట్టు

కొని తనకుమారునికి బదులుగా పెట్టి దానిని అర్పించెను.

4. యెహోవయొక్క దూత రెండవసారి యాకాశమునుండి అబ్రాహామును పిలిచి యిట్లనెను: "నీవు నీకొక్కడయియున్న నీకుమారుని నాకియ్యనొల్లక నుండలేదు గనుక నేనునిన్నాశీర్వదించి యాకాశ నక్షత్రములవలెను సముద్ర తీరమందలి ఇసుకవలెను, నీసంతానము విస్తరింపజేసెదను. మరియు నీవునామాటలు విన్నందున నీసంతానమువలన రాష్ట్రములన్నియు దీవింప బడును"

ఆదికా.21,22.

# — VI —

# యిసాకును అతని కుమారులయిన ఏశావును యాకోబును.

1. అతని తల్లియయిన సారాచనిపోయిన తరువాత యిసాకు హారానుదేశస్థురాలయిన రిబెక్కాయను పేరుగల నొకస్త్రీని వివాహముచేసుకొనెను.- ఆదికా. 25 —

ఆమెగర్భవతియయికవలవారినికనెను. మొదటివానికి ఏశావనియు రెండవవానికి యాకోబనియు పేర్లుపెట్టబడెను. యిసా

కు తన జ్యేష్ఠుడయిన ఏశావుయందు యెక్కువ ప్రేమగలవాడయి యుండెను. గాని రిబ్కా యాకోబును యెక్కువగా ప్రేమించెను,

2. ఆపడుచు వారెదిగినప్పుడు ఏశావు వేట నెరిగి యరణ్యవాసి యైయుండెను యాకోబు గుడారములో నివసించుచు గొర్రెల కాపరాయెను. ఒకనాడు యాకోబు అన్నము వండుకొనుచుండగా ఏశావు పొలమునుండి వచ్చి అలసి యుండెను. ఏశావు యాకోబును చూచి, దయచేసి కొంచెము నాకిమ్మని అడుగగా- ఆయన నీ జ్యేష్ఠత్వము నేడు నాకిచ్చినయెడల నీకన్నము పెట్టుదుననెను. అందుకు ఏశావు: నేను చావబోవుచున్నాను నాకు జ్యేష్ఠత్వమెందుకని చెప్పి యాకోబుకు ప్రమాణమిచ్చి అతనికి తన జ్యేష్ఠత్వమునిచ్చి దానిత్యాగించెను.

ఆది. ౨౫.

# VII

# యెహోవా యిస్సాకుతో చేసిన నిబంధన

1. అబ్రాహాము నిండు వృద్ధాప్యుడాయెను ఆయన బ్రతికిన సంవత్సరములు నూటడెబ్బదియైదు అబ్రాహాము కాలముచేసిన తరువాత యెహోవ యిస్సాకుకు ప్రత్యక్షమయి: "నేను నీకుతోడయియుం

డి నిన్నాశీర్వదించెదను నీకును నీసంతానము నకును యీ దేశమునిచ్చెదను నక్షత్రములవలె నీసంతానము విస్తరింపజేసి సమస్త భూరాష్ట్రములను నీసంతానము వల్లఆశీర్వదించెదను.”

ఆదికాండ. 26.

# — VIII —

## యెహోవ యాకోబుతో చేసిన నిబంధన

1. ఇస్సాకు తనకుమారుడైన యాకోబును పిలిపించి ఆయనకు చెప్పినదేమనగా: నీవు కనాను కుమార్తెలలో నొకతెను వివాహము చేసికొనరాదు. నీవు లేచి పద్దనరాములోనున్న బెతూయేలు యింటికి వెళ్ళి నీతల్లిసహోదరుడగు లాబాను కుమార్తెలలో నొకదాని పెండ్లిచేసుకొనుము. సర్వశక్తిగలదేవుడు అబ్రాహాముయొక్క ఆశీర్వాదమునీకుదయచేయునుగాక.

2. యాకోబు తనతండ్రిచెప్పినమాటలువిని లేచిపద్దనరామునకు ప్రయాణమై బైలుదేరెను. ఆయన మార్గమున వెళ్ళుచుండగా నొకరాత్రి అతనుబసచేయుటకు సుమారు పొద్దుగ్రుంకెను. అప్పుడు యాకోబు ఒకరాయితీసుకొని దానితలగడగా చేసుకొని పండుకొనెను. యారాత్రి అతడొక కలకనెను. దేవుని దూతలు దానిమీద యెక్కుచు దిగుచు ఆకాశమునంటి భూమిమీదనిలువబడు

యొక నిచ్చెన స్వప్నమందు అతనికి కనబడెను. మరియు యెహో
వ దానికి మీదుగానిలిచి: “నేను నీతండ్రియైన అబ్రాహా
ముయొక్క దేవుడను. ఇస్సాకు దేవుడనైన యె
హోవాను. నీవుపండుకొనియున్న ఈభూమిని నీకు
ను నీసంతానమునకు నిచ్చెదను. భూమియొక్క వం
శములన్నియు నీయందు ఆశీర్వదించబడును.”

3. అప్పుడు యాకోబు నిద్రనుండి లేచి భయపడి నిశ్చయముగా
యెహోవ యీస్థలమందున్నాడు. యీచోటు యెంతో భ
యంకరము. ఇదిదేవుని మందిరము యిదియాకాశముయొక్క గ
వినను కొనెను. తెల్లవారినప్పుడు యాకోబులేచి తానుతలగడగా
చేసికొనిన రాయితీసికొనిదానిని స్తంభముగా నిలిపిదానిమీదనూనె
పోసెను. మరియు యాస్థలమునకు బేతేలను పేరుపెట్టెను.

ఆదికాం 28.

## — IX —

# యాకోబుయొక్క సంతానము

1. అప్పుడు యాకోబు తూర్పుజనుల దేశమునకు వెళ్లెను. ఆయన
హారానను పట్టణమున చేరినప్పుడొకవాడు ప్రొద్దుగ్రుంకిన సమయ
ము ఒకబావిని సమీపించెను. తనతండ్రి గొర్రెలనునీళ్ళు త్రాగిం
చుటకై రాహేలను లాబానుయొక్క కుమార్తె నూతిదగ్గరకు వ

చ్చెను. యాకోబువందనములుచేసి తాను రిబెక్కాకుమారుడని యామెకు తెలిపెను. రాహేలు యాసంగతివిని పరుగెత్తి తన తండ్రియగు లాబానుకు దానిని తెలియ జేసెను. కాబట్టి ఆయన లేచి యాకోబునెదురుకొనుటకై పరుగెత్తి అతని కౌగలించి ముద్దుబెట్టుకొని తనయింటికి తోడుకొనివెళ్ళెను మరియు లాబానుకు ఇద్దరుకుమార్తెలుండిరి. యాకోబుఅతనికి కొలువుచేసెను.

2. యాకోబు లాబాను దగ్గర నెలదినములు నివసించినతర్వాత లాబాను: నీవునాబంధువుడవైనందున యూరక నేనాకు కొలువుజేయుదువా? నీకేమిజీతముకావలెనోనాకు తెలుపుమని యడిగెను. అందుకాయన: నీచిన్నకూతురైన రాహేలునిమిత్తము నేనేడు సంవత్సరములు కొలువుచేసెదననెను. దానికిలాబాను సమ్మతించి వారియొద్దనుండుటకు ప్రత్యుత్తరమిచ్చెను. మరియు యాకోబు రాహేలు నిమిత్తమేడు సంవత్సరములు సేవచేసెను. యాఏడేండ్లుకొన్ని దినములవలె అతనికి కనబడిన లాగున యాకోబు రాహేలును ప్రేమించెను.

అతని కొలువుసంపూర్ణమైనప్పుడు యాకోబు రాహేలు నతనికిభార్యగా నివ్వవలసియున్నట్లు లాబానుకు మనవిచేసెను. అందుకాయన: పెద్దపిల్లకంటె ముందుగా చిన్నపిల్లనిచ్చుట మాదేశమర్యాదకాదని చెప్పి లేయాయను పెద్దపిల్లనతనికిచ్చి నీవింక యేడుసంవత్సరములు నాకుసేవచేయుకొలువుకొరకై చిన్నపిల్లనుగూడ నీకిచ్చెదనని చెప్పెను. యాకోబుదానికొప్పుకొని అతనికింక ఏడేండ్లుసేవచే

పి రాహేలునుకూడ భార్యగాతీసుకొనెను. యాపదు నాలుగు సంవత్సరములైనతర్వాత ఇంక ఆరుయేండ్లు లాబానుదగ్గరయుండి యాకోబువిస్తారములయిన పశువుల గొర్రెల మందలను గణించెను.

3. యాకోబు లాబానుదగ్గర నివాసముచేసిన కాలమందతనికి పదునొకరు కుమాళ్ళు పుట్టిరి. వారిపేర్లేమనగా:

రూబేను, షిమ్యోను, లేవి,యూదా,దాను, నఫ్తాలీ, గాదు, అషేరు, ఇశ్శాకాను, జెబులూను,యోసేపు.

ఆయన హారానునుండి ప్రయాణమై వెళ్లేటప్పుడు బెన్యామీను అనువాడు పుట్టెను.

ఆదికాం. 29-30.

## — X —

# యాకోబుతన తండ్రియింటికి ప్రయాణమైతిరిగివెళ్లుట

1. యాకోబుయొక్క సంపదలను బట్టిలాబానును అతని కుమారులును ఆయనవిషయమై మత్సరపడినవారయిరి. యెహోవా: నీ తండ్రియింటికి తిరిగివెళ్లుము నీకు తోడయి యుందునని యాకోబుకు సెలవిచ్చెను. అందుకుయాకోబు తనకు కలిగిన యావదాస్తిని తీసుకొని తన భార్యలను పిల్లలను వెంటబెట్టుకొని కనాను దేశము

ముందు తన తండ్రియింటికి ప్రయాణమై బైలువెళ్లెను. ఆయన మార్గమున వెళ్లుచుండగా దేవదూతలతనికి కనబడిరి.

2. హారాను పద్దనరాము దేశమునకు వెళ్లకముందే జేయరానికార్యములచే యాకోబు తన అన్నయైన ఏశావుయొక్క కోపాగ్ని మండించిన వాడు .

ఆది కాం 27

అందువలన తనజయ సంపాదించుటక్కై యాకోబు తన సేవకులైన వారినితనకు ముందుగా ఏశావుయొద్దకు పంపినాడు. అయ్యో నీసహోదరుడగు ఏశావు నన్నూరుమందితో నిన్నెదురుకొన వచ్చుచున్నాడని వారు తిరిగివచ్చి యాకోబుకు తెలియచేసిరి. అందుకు యాకోబుజడిసి నాయన్నయగు ఏశావు యొక్క శిక్షనుండి నన్ను తప్పించుమని దేవునికిప్రార్థనజేసి కానుకగా పశువులను గొర్రెలను మేకలను ఒంటెలను గాడిదలను తనసహోదరునికి పంపెను.

3. తర్వాత యారాత్రి తెల్లవారు పర్యంతమొకనరుడు యాకోబుతో పెనుగులాడెను. అప్పుడానరుడు తెల్లవారుచున్నది గనుక నన్ను వెళ్లనిమ్మని యాకోబుతో జెప్పెను. నీవునన్ను ఆశీర్వదించని పక్షమందునిన్ను వెళ్లనీయనని యాకోబు ప్రత్యుత్తరమిచ్చిన పిమ్మటానరుడు:

నీవు దేవునితోనుమనుష్యులతోనుపోరాడిగెలిచితివిగ

నుక నీపేరు యాకో బనబడక యిశ్రాయే లనబడును నిచెప్పి అతని నాశీర్వదించెను.

4. సూర్యోదయమున ఏశావును అతనితో నున్న నన్నూరు మంది ని వచ్చుచుండుట యాకోబు చూచినప్పుడాయన లేచి వారిని కలుసు కొనుటకై బయలు దేరెను. ఏశావు యాకోబును చూచుచుండ గా అతని యెడల వాత్సల్యభావము నొంది అతని యెదురుకొని పరుగె త్తి అతని కౌగలించుకొని ముద్దుబెట్టుకొనెను. వారిద్దరు కన్నుల నీ ళ్ళు పెట్టుకొని యేడ్చిరి. అలాగున యీయిద్దరు అన్నదమ్ములు స మాధాన పడిరి.

5. తర్వాత యాకోబు సుక్కోతుకు వెళ్లి యెహోవకు యజ్ఞవేదిక కట్టి ఆయనకు సమర్పించెను. అప్పుట యెహోవా యాకోబుకు ప్రత్య క్షమై: అబ్రాహాము ఇస్సాకు అను పితరులయిన వారికి నేనిచ్చి న భూమి. నీకు యిచ్చెదను.
యని అతనికి వాగ్దత్తము దయచేసెను.

ఆదికాండ.31— 35.

# — XI —

## యాకోబు కుమారుడయిన యోసేపు విషయము

యోసేపు పదునేడేండ్లవయస్సు గలవాడయి నప్పుడాయన తనయు

న్నదమ్ములతో కూడ గొఱ్ఱెలమందలను కాచుచుండెను. యోసే
పు బాల్యమునుండిభయభక్తిగలవాడు. అతని సహోదరులు అక్ర
మస్థులయినందున నపకీర్తి చెందినవారు. వారిచెడ్డతనమునుగురిం
చి సమాచారము యోసేపు తమతండ్రికి తెలియజేసినందుననున్ను
అతనియెడల యాకోబుయెక్కువ వాత్సల్యభావమునొందియున్నం
దుననున్ను వారతని యందెక్కువగాద్వేషించిరి.

అదియునుగాక యోసేపు ఒకరాత్రికలగని తనసహోదరులకు దాని
దెలియ జేసినదేమనగా: మనముపొలములో పనలుకట్టు చుంటిమి
అప్పుడదిగో నాపనలేచి నిలుచుండెను. అలాగుండగా మీపనలు
గూడలేచి దానిచుట్టుకొని దానికి సాగిలపడెననెను. అందుకువా
రు: నీవుమమ్ము నిశ్చయముగా నేలెదవా? నిస్సందేహముగా మా
మీద నీకధికారము కలుగునా యని అతని తిరస్కరించి ఆయన
మీద కక్షపట్టిరి.

ఆదికాం. 37

## 2 యోసేపు గుంటలోకి త్రోసివేయబడుట.

యోసేపుసహోదరులు నొకసారి తమతండ్రియొక్క గొఱ్ఱెలమంద
లను కాచుచుండగా తండ్రివారిక్షేమము తెలుసుకొను నిమిత్తము
యోసేపు వారిని సమీపించుచుండగా వారాయనను చూచి స్వ
ప్నకర్త వచ్చుచున్నాడు. వానిని చంపియిచ్చటనున్న ఒకగుహ
లోకి వానినిపడద్రోసి దుష్టమృగ మాయనను తినివేసెనని మాతం
డ్రితో చెప్పుదుమని ఒకనితోనొకరు చెప్పుకొనుచుండిరి. రూబే

ను యోసేపును రక్షింపనుద్దేశించి తండ్రికతనినప్పగింప తలచి: రక్త
ము చిందింపకండి, ఒకగుంటలోకి అతని పడద్రోయుడని వారితో
చెప్పెను.

యోసేపు వారిదగ్గర చేరినప్పుడా ప్రకారముగా చేసిరి. నీళ్లు
లేనిఒకగుంటలోకి అతని పడద్రోసిరి.

ఆదికాం. 37

తరువాత యోసేపు సహోదరులు భోజనముచేయకూర్చుండిరి.
అప్పుడు యిష్మాయేలీయులనే మార్గస్థులయినవర్తకులు కొందరుయా
మార్గమున ప్రయాణమై వచ్చినారు. యూదావారిని చూచితన
సహోదరులకిట్లనెను: మనము మనసహోదరుని చంపి రక్తము మ
రుగుచేయుటవలన ప్రయోజనమేమి? వాడు మనరక్తసంబంధకా
డా? యీవర్తకులకతని అమ్మివేయుదము. రండి. అందుకువారు
సమ్మతించి యోసేపును గుంటనుండి పైకితీసి యిరువదివెండి రూక
లకు యీవర్తకులకతని అమ్మివేసిరి. తరువాత యోసేపు సహోదరు
లు ఒకమేకపిల్లను తీసుకొని వధించి దాని రక్తములో యోసేపు
యొక్క యంగీని ముంచిరి. యీఅంగీని తమతండ్రి దగ్గరకు పం
పి: యిదిమాకు దొరికి యున్నది. యీయంగీ నీకుమారునగుయోసే
పు దాలేదా దానిగుర్తించుమనిరి:

అప్పుడు తండ్రి దానినిగురుతుపట్టి యీయంగీ నాకుమారునిదే. దు
ష్టమృగమతని నిశ్చయముగా చీల్చితిని వేసెనని చెప్పి తనబట్టలు చిం
చుకొని యనేక దినములు తనకుమారుని విషయమై అంగలార్చుచు
ను.

ఆదికాం. 37

## 4. యోసేపు ఖైదిలోకి త్రోసివేయబడుట.

యిస్మాయేలీయులు యోసేపును వెంటబెట్టుకొని అయిగుప్తుదేశము నకువెళ్ళిరి. అచ్చట ఫరోయొక్క ఉద్యోగస్థుడగు పోతిఫరను వానికతనినమ్మివేసిరి. మరియుయోసేపు పోతిఫరుయొక్కయిం ట్లోచేసినది యావత్తు సఫలమగునట్లు యెహోవఅతనికి తోడయి యుండెను. గనుక పోతిఫరు యోసేపుయందు కటాక్షముంచి తనయింటిమీద అతని విచారణకర్తగా నియమించి తనకు కలిగిన దంతయు అతనికప్పగించెను. మరియు యోసేపు నిమిత్తము దేవు డాయనింటిని నాశీర్వదించెను ఒకనాడు పోతిఫరుయొక్క భా ర్య పాపసంబంధమైన దుష్కార్యములు చేయుటకై యోసేపును ప్రేరేపించెను, ఆమెచెప్పిన మనోహరమైన మాటలకు చెవినొ గ్గక దేవునికి విరోధముగా యెట్లుపాపము చేయగలనని చెప్పికొను తప్పించుకొనెను అందుకామె యోసేపుమీద కోపపడుచు అబద్ధ పు నేరము స్థాపించుచు అతని విషయమయి తనపెనిమిటికి ఆగ్రహ ముపుట్టించెను. తనభార్యచేసిన కృత్రిమము గ్రహింపకామె చె ప్పిన మాటలు నమ్మినందున పోతిఫరు యోసేపును పట్టించి చెర సాలలోకి వేయించెను.

అయినను యెహోవయోసేపుకుతోడైయుండి అతనికి చెరసాలధి పతియొక్క కటాక్షము కలుగునట్లుచేసెను.

రాజుయొక్క పానదాయకుడును భక్ష్యకారుడును తమప్రభువైన రాజుయెడల తప్పుచేసిరిగనుకాయన వారిమీద కోపపడి వారిని

Pinted at B. V. PRESS, BAPATLA.

యోసేపు బంధింపబడిన ఖైదిలోకి పంపించెను. కొన్ని దినము
లయిన తరువాత ఒకరాత్రి వారిద్దరు కలలుగనిరి. తెల్లవారి
నప్పుడు యోసేపు వారిదగ్గరకు వచ్చి వారినిచూడగా వారిద్దరు
చింతాక్రాంతులయి యుండిరి. అందుకాయన మీముఖములు నే
డు చిన్నబోయిన కారణమేమని వారినడుగగా వారు, మేముకల
లుకంటిమి. వానిభావము చెప్పగలిగినవాడెవడును లేడని ప్రత్యు
త్తరమిచ్చిరి. అందుకుయోసేపు: భావములు చెప్పుట దేవుని దేక
దా? మీకలలను నాకు వివరించిచెప్పుడనెను. వారు ఒకొ్క
క్కడు వెవ్వేరు భావములుగల తమతమకలలను యోసేపుకు వివరిం
చుచుండగా ఆయన వాటి వాటి భావము ప్రకారము వారికి తెలిపి
నదేమనగా:

పానదాయకుడు కనినకలకు రాజుఅతనిక్షమించి అతనిఉద్యోగము
మళ్ళీయతనికిప్పించునని అర్థమగును. భక్ష్యకారుడు కనినకలకు:
రాజు తనకోపముమానక అతని మ్రానుమీదవ్రేలాడవేసి చంపునని
యర్థమగును. మూడవదినమున యట్లేజరిగెను.

ఆదికాం. 39 40

## 5. యోసేపు హెచ్చించబడుట.

1 రెండేండ్లయిన తర్వాత ఐగుప్తురాజు ఒకకలగనెను. ఆయ
న స్వప్నమందుచూచినదేమనగా: చూపునకు అందమైనవిని బలి
సినవిని ఏడుయావులు నదిలోనుండి పైకివచ్చుచు జమ్ములో మేయు
చుండెను. వాని తరువాత చూపునకు వికారమయినవిని చిక్కి

పోయినవియైన మరియేడావులు ఏటిలోనుండి పైకివచ్చుచు ఒడ్డుదగ్గరని లుచుండెను. మరియుచిక్కిపోయిన యావికారమయిన యావులు బలసినవి చూపునకందమయిన యాయావులను తినివేయుచుండెను. అంతలోరాజు మేలుకొనెను.

మరియుఅతడు నిద్రించి రెండవసారి కలకనెను అందులోమంచి పుష్టిగల యేడువెన్నులుఒకదంటున పుట్టుచుండెను. తూర్పుగాలి చేచెడిపోయిన యేడుపీలవెన్నులు వాటితరువాత మొలుచుచుండె ను అప్పుడునిండైన యాయేడువెన్నులను యాపీలవెన్నులు మ్రింగివే యుచుండెను. అంతలోరాజు మేలుకొనెను.

తెల్లవారినప్పుడు కలతపడినందునకలలభావము తెలుపుటకై రాజు జ్ఞానులందరినిన్ని విద్వాంసులందరినిన్ని తనదగ్గరకు పిలిపించెనుగాని దానిభావము తెలుపగలవాడు వారిలోయొకడును లేడు.

అప్పుడుకైది లోనుండి విడిపించబడిన పానదాయకు డు యోసేపును జ్ఞాపకముచేసుకొని రాజుతో యిట్లనెను. నేను చె రసాలలో యున్నప్పుడు కలలభావములు తెలుపగలిగిన యోసేపు అను నొక హెబ్రీపడుచువానితో స్నేహము చేసుకొంటిని. నే నును భక్ష్యకారుడును కైదిలోయున్నప్పు డొకరాత్రి మేమిద్దరము కలలుకంటిమి. వాటిభావము యాహెబ్రీపడుచువాడు తెలిపినా డు. ఒక్కొక్కనికల చొప్పున దానిదానిభావము తెలిపినాడు. ఆయ న మాకు ఏయేభావము తెలిపెనో ఆయాభావముచొప్పున జరిగెను.

౩౦ రాజు యామాటలు వినుచుండగా ఆయన యోసేపును త్వర గా చెరసాలలోనుండి రప్పించి అతనితో యిట్లనెను. నీవుకలలను

తెలుసుకొని వాటిభావము తెలుపగలవాడవని నిన్నుగురించి వినియున్నాననెను. అందుకాయన నావలన కాదుగాని యెహోవ రాజుకు క్షేమకరమయిన వుత్తరమిచ్చునని చెప్పగా. రాజు తనకలలను వినిపించిన తర్వాత యోసేపు రాజుకు కెట్టింపబడిన యాకలలచే దేవుడు తాను శీఘ్రముగా జేయబోవు కార్యమును తెలియజేసి యున్నాడు. యేమనగా! అయిగుప్తు దేశ మందంతటను గొప్ప సమృద్ధిగల ఏడేండ్లు వచ్చుచున్నవి. వాటివెనుక కరువుగల ఏడుసంవత్సరములు వచ్చుననెను. కరువుచేత దేశము నశించిపోవునట్లును సమృద్ధిగల ఏడు సంవత్సరములలో దేశమంతటను పంటలలో అయిదవ భాగముపుచ్చుకొని ధాన్యము పోగుచేసి దేశములో కలుగబోవు కరువుగల ఏడేండ్లకు సంగ్రహించునట్లును రాజు వివేకజ్ఞానముగల నొకని నియమింపవలెనని యోసేపు రాజుకు మనవి జేసెను.

4 రాజు యోసేపుయొక్క బుద్ధికుశలతనుచూచి అతడు చెప్పినదివిని సంతోషించి తన సేవకులయినవారిని పిలిపించి వారితో యిట్లనెను. ఇతనివలె దేవునిఆత్మగల మనుష్యుడు లేచేలేడని. యోసేపునుచూచి అతనితో దేవుడు ఇదంత నీకు తెలియపరిచెను. కాబట్టి నీవలె వివేకజ్ఞానము గలవాడు యెవడునులేడు. నీవు నాయింటిమీద యధికారివై యుండవలెను. నాప్రజలందరు నీకు విధేయులయి యుందురు. సింహాసనమందు మాత్రమే నేను నీకంటే యధికుడనై యుందునని చెప్పి తనచేతినున్న వుంగరము తీసి యాతనిచేతికిపెట్టి సన్నపు నారబట్టలతనికి తొడిగించి యతని మెడకు బంగారపు గొలుసువేసి తనకుండిన రెండవరథముమీద నతనియెక్కించి ఆయనకు వందనము జేయవలెనని తనప్రజలకు యాజ్ఞయిచ్చి అయిగుప్తు దేశమంతటిమీద యధిపతిగా నియమించెను.

5. సమృద్ధిగల యేడుసంవత్సరములలో భూమి అతివిస్తారమైన పంటపండెను. యోసేపుసమయమును గుర్తెరిగి కుప్పలుకుప్పలుగా ధాన్యము పోగుచేసెను.

సమృద్ధిగల సంవత్సరములు గతించినతరువాత యోసేపు జెప్పిన ప్రకారముగా యేడు కరువుయేండ్లు కలుగ నారంభించెను. అప్పుడు యోసేపు కొట్లన్నియు విప్పించి అయిగుప్తీయులకు ధాన్యము అమ్మకముచేసెను. ఆకరువు ప్రతిదేశమందు సంభవించెను. గనుక యోసేపుదగ్గర ధాన్యముకొనుటకై సమస్తదేశస్థులు అయిగుప్తుదేశమునకు వచ్చిరి. కాబట్టి యోసేపు ప్రసిద్ధినొంది బహుగా శ్లాఘించబడినవాడాయెను.

ఆదికాం. 41.

## 6. యోసేపుయొక్క యన్నదమ్ములు అయిగుప్తుదేశమునకు మొదటిసారి ప్రయాణమై వెళ్ళిపోవుట.

1. కనానుదేశములో కరువు భారమయివుండినందున ధాన్యముకొనుటకై యాకోబు ఐగుప్తు దేశమునకు తన కుమారులను పంపుచూ అతనికి హాని సంభవించునేమో యనే కారణముచే యాకోబు కనిష్ఠుడగు బెన్యామీను నను వాని వారితో పంపలేదు. అప్పుడు యోసేపు యాదేశములో యధికారియై యుండెను. ప్రజ లందరికి ధాన్య మమ్మకము చేసినవాడు యోసేపు యన్నదమ్ములు అతని ఎదుటవచ్చి సాష్టాంగపడి, అతనికి వందనము చేసిరి. వా రతనిని గురుతు పట్టలేదు. యోసేపు వారిని గుర్తించినను అతడు వారికన్యులవలె కనబడి మీరు వేగులు, దోషగ్రస్థులయి ఈదేశమును కను

గొనుటకై వచ్చినారని వారితో కఠినముగా మాటలాడెను. అందుకు వారు లేదు ప్రభువా తమ సేవకులమైన మేము యథార్థవంతులమేౘ పన్నిద్దరు యన్నదమ్ములము. మాలో చిన్నవాడు మా తండ్రియొద్ద నిలిచియున్నాడు. ఒకడు కాలధర్మ మొందెనని ప్రత్యుత్తర మిచ్చిరి.

అందుకు యోసేపు క్రోధవార్థమయి నేను చెప్పినది సరే మీరు వేగులవారే గనుక మీరు యిచ్చటనుండి వెళ్లక యుందురని చెప్పి వారిని బంధించి మూడు రోజులు వారిని ఖైదీలో నుంచెను. మూడవదినమున యోసేవు వారిని చూచి యిట్లనెనుః మీలో ఒకడు ఈ చెరసాలలో బంధింపబడి యుండవలెను. కడమవారు మీ కుటుంబముల కరువు తీర్చుటకయి మీరు కొనిన ధాన్యము తీసుకొని ఇంటికి పోవలెను. తరువాత మీతమ్ముని తీసుకొని నాచెంతకు రావలెను. అట్లు మీ మాటలు సత్యమయినవని కనబడినయెడల బ్రతుకుదురు.

ఆ మాటలు విని వారు నిశ్చయముగా మన తమ్ముడగు యోసేపుయెడల మనము చేసిన అపరాధ నిమిత్తమిది సంభవించెను. యతడు మనలను బ్రతిమాలుకొనినప్పుడు మన మతనిబాధ చూచియు వినకపోయినవార మైతిమి. అతని రక్తాపరాధన మనమీద మోపబడి యున్నదని నొకరితో నొకరు చెప్పుకొనుచుండిరి. యోసేపుకును వారికిని మధ్య ద్విభాషి యుండెను. గనుక మనవారు చెప్పిన మాటలు గ్రహించెనని వారు తెలుసుకొనలేదు. యోసేపువారిసంభాషణ వినుచుండగా వాయన వారియొద్దనుండి దొలగిపోయి కన్నుల నీళ్లుపెట్టుకొని యేడ్చెను. తరువాత వారిదగ్గరకు తిరిగివచ్చి వారితో మాట్లాడి షిమోనును పట్టి వారియెదుట నతని బంధించెను.

వారి గోనెలను ధాన్యముతో నింపించుటకును యెవనిరూకలు వానిగోనెలో తిరిగి వేయుటకును ప్రయాణముకొరకుభోజన పదార్థములు వారికిచ్చుటకును యోసేపు తన నౌకరుల కాజ్ఞయిచ్చెను. తరువాత తమ దేశమునకు ప్రయాణమై తిరిగి వెళ్లుటకు యోసేపువారికి సెలవిచ్చెను.

2. అప్పుడు వారు సైలుదేర కానాను దేశమునకు తిరిగివెళ్లిరి. వారు యింటికిచేరి తమ తండ్రియయిన యాకోబును చూచి తమకు సంభవించినది యావత్తు యతనికి తెలియజేసిన దెట్లనగా యాదేశమునకు ప్రభువైనవాడు మాతో కఠినముగా మాటలాడి యాదేశమునువేగుచూచువారమని మమ్ము నెంచెను. అందుకు మేము యథార్థులము, వేగులవారము కాము, పన్నెండుమంది యన్నదమ్ములము, మాలో నొకడు కాలధర్మము నొందియున్నాడనిన్ని మాలో చిన్నవాడు తండ్రియొద్ద నిలిచియున్నాడనిన్ని చెప్పి యుంటిమి. అందుకు యాప్రభువు మమ్మునుచూచి యిట్లనెను: మీలో నొకని నాయొద్ద యుంచి "మీకుటుంబముల కరువు తీరునట్లు ధాన్యము తీసుకొనివెళ్లుడి.తరువాతమీతండ్రియొద్ద నిలచియుండు యాచిన్నవానిని నా చెంతకు తీసికొనిరండి. మీమాటలు సత్యమైనవో కావో నేను తెలుసుకొనునట్లు మీలో నొకని బంధించి మీరుయాచిన్నవానిని తీసుకొని తిరిగివచ్చినదాక ఖైదీలో నుంచెదనని చెప్పి యాప్రభువు షీమ్యోను పట్టి మాయెదుట అతని బంధించి చెరసాలలోకి పంపెనని వారు వివరించి తమ తండ్రితో చెప్పిరి. మరియు వారు తమతమ గోనెలను విప్పుచుండగా ఎవని రూకల మూట వాని గోనెలో నుండెను. గనుక వారును వారితండ్రియును మిగులజడిసినవారైరి,యాకోబుతనకనిష్ఠుడయిన.బెన్యామీనుఅయిగు ప్రగే

శమునకు వెళ్లనలసిన సంగతి వినినప్పు డాయన బహు చింతాక్రాంతుడయి నన్ను పుత్రహీనునిగా జేయుదురు. యోసేపు లేడు. షిమ్యోను లేడు. బెన్యామీనును తీసుకొని వెళ్లుదురు. ఇవన్ని నాకు ప్రతికూలముగా నున్నవి. నెరసిన వెంట్రుకలుగలనన్ను సమాధిలోకి దిగజేయుదురని మొరబెట్టుచు నుండెను.

ఆదికాం, 42.

## 7. యోసేపుయొక్క యన్నదమ్ములు రెండవసారి ఐగుప్తు దేశమునకు ప్రయాణమై వెళ్లుట.

(a) కానాను దేశములో కరువుఇంక భారముగాయున్నందున యాహారమును కొనుటకై యాకోబుమళ్ళి తనకుమారులను ఐగుప్తుదేశమునకు పంపెను. బెన్యామీనును కూడ వారితో సాగనంపెను. వారు బైలుదేరి అయిగుప్తుదేశమునకు వెళ్ళి యోసేపునెదుట నిలిచిరి. యోసేపు వారినిచూచి తనవిచారణ కర్తను పిలిపించి యతనితో ఈమనుష్యులు నాతో భోజనము జేయవలెను. నాయింటికి వారిని తీసుకొని వెళ్ళుమని అతనికాజ్ఞయిచ్చెను. అతడాప్రకారముగా జేసెను. యోసేపుయొక్క యింటికితప్పింపబడినందున వారు భయపడి మొదట మనగోనెలలో తిరిగివేయబడిన రూకల నిమిత్తము యీప్రభువు మనమీదకోపపడి మనమీదికి దొర్లివచ్చి మనమీదపడి మనమతనికి దాసులమగుటకై లోపటికి రప్పించెననుకొనిరి.

యోసేపు తనయింటికివచ్చినప్పుడు వారుతమతండ్రిపంపిన కానుకలతనికిచ్చి యతనికి సాగిలపడిరి. అప్పుడు మీరుచెప్పిన

ముసలివాడయిన మీతండ్రి క్షేమముగాయున్నాడా! అతడు నింక సజీవుడైయున్నాడా? యని యోసేపు వారినడిగినందున వారు న్నాడని ప్రత్యుత్తర మిచ్చిరి. యోసేపు తనసహోదరుడయిన బెన్యామీనునుచూచి మీరుచెప్పిన మీతిమ్ముడితడేనాయని యడిగి నాకుమారుడా! దేవుడు నిన్ను కరుణించుగాకని పలికెను. తనసహోదరుని యెడల యోసేపు కరుణారసము పొంగెను. గనుకఅతడు త్వరపడి యేడ్చుటకై చోటువెదకి లోపలిగదిలోకివెళ్ళి అక్కడేడ్చి, ముఖముకడుగుకొని వెలపలికివచ్చి తన్నుతాను అణచుకొని ఆహారము వడ్డించుడని చెప్పెను.

(c) వారు భోజనము చేసినతరువాత యోసేపు ఈమనుష్యుల గోనెలు పట్టునంత యాహారపదార్థములతో వానినింపి యెవనిరూకలువానిగోనెమూటలో పెట్టుమనియు బెన్యామీను మూటలో వెండిదైననాగిన్నెయునుతనధాన్యపురూకలను పెట్టుమనియు తనయింటి విచారణకర్త కాజ్ఞయిచ్చెను.

యోసేపు జెప్పినచొప్పున నతడు జేసెను.

ఆదికాం. 43. 1—44.2.

## 8. యోసేపు తన యన్నదమ్ములకు తన్నుతాను బైలుపరచుకొనుట.

(a) మరునాడు తెల్లవారినప్పుడు యోసేపు యన్నదమ్ములుతాము కొనిన ధాన్యము తీసికొని తమ దేశమునకు ప్రయాణమయి బయలు వెళ్లిరి. అప్పుడు యోసేపు తన యింటివిచారణ కర్తను చూచి అతనితో యిట్లనెను: నీవు లేచి యీ మనుష్యులను తరిమి, వారిని పట్టుకొని వెండిదైన నాప్రభువుయొ

క్క గిన్నెను మీరు తీసికొనిపోవుట ఏల? మీరు చేసినది మంచిది కాదని నీవు వారితో చెప్పవలయుననెను. అప్పుడాయనట్లు జేసెను.

యోసేపు సహోదరులు తమ గోనెలను దించి విప్పుచుండగా బెన్యామీనుయొక్క గోనెలో యీగిన్నె దొరికెను. అప్పుడు వారు తమ బట్టలు చించుకొని ప్రతివాడు తనతన గాడిదమీద గోనెలు యెక్కించుకొని తిరిగి పట్టణమునకు వచ్చి యోసేపుయొక్క యింటికివెళ్లి యతనియెదుట నేల సాగిలపడి యిట్లనిరి. ఏలినవారితో యేమి చెప్పగలము, మేమేమి పలుకగలము. మానీతి ఏలాగు కనపరచగలము. దేవుడు మా నేరము కనుగొనెను. ఎవనియొద్ద యీగిన్నె దొరుకునో వాడును మేమును యేలినవారికి దాసులమవుదుమనిరి. అందుకు యోసేపు అట్లు జేయుట నాకు దూరమవుగాక. ఎవని దగ్గర యీగిన్నె దొరికెనో వాడు నాకు దాసుడయి యుండును. గాని మీరు మీతండ్రియొద్దకు సమాధానముగా వెళ్లవచ్చును.

b) యూదా యనువాడు యోసేపును చూచి అతనితో యిట్లనెను ఏలినవారితో దాసుడనయిన నేనొకమాట చెప్పగోరుచున్నాను. తమకోపము రవులుకొననీయకండి. మేము మాతండ్రియొద్దకు తిరిగి వెళ్లునప్పుడు యీచిన్నవాడు మాతోకూడ ఉండనియెడల మాతండ్రి యీసంగతి చూడగానే అయన చింతచే చనిపోవును. అట్లు మేము నెరసిన వెంట్రుకలుగల మాతండ్రిని దుఃఖమువల్ల సమాధిలో దిగజేయుదుము గనుకదయచేసి, నా మనవి ఆలకించి యీచిన్నవానిని తన సహోదరులతోకూడ వెళ్లనిచ్చి వానికి బదులుగా నన్నుంచుకొండని చెప్పెను.

(c) అప్పుడు యోసేపు తన్ను తాను నుణచుకొనజాలక కన్నీళ్ళు పెట్టి నత్యుగ్రముగా యేడ్చెను. నేను యోసేపును నాతండ్రియింక సజీవుడాయని వారినడుగగా వారతనిసముఖమందు తొందరపడిన వారయి యాతనికుత్తరమీయలేకపోయిరి. మరియు యోసేపు వారితో యిట్లనెను. మీరు యిష్మాయేలీయుల ఘనవర్త్తకుల కమ్మివేసిన మీసహోదరుడనైన యోసేపును నేనే. నేను యిచ్చటకువచ్చునట్లు మీరు నన్నమ్మివేసినందున మీరుదుఃఖపడనక్కరలేదు. మీజీవరక్షణకొరకు దేవుడు మీకు ముందుగానన్ను యీదేశమునకు పంపెను. కాబట్టిదేవుడేకాని మీరు నన్నుయిక్కడికి పంపలేదు. ఈరాజుకు తండ్రిగాను యీదేశమంతటిమీద ప్రభువుగానాయన నన్నునియమించియున్నాడని. యోసేపు వారందరిని ముద్దుబెట్టుకొని బెన్యామీనును కౌగలించుకొని యేడ్చెను.

(d) మరియు యోసేపు తనసహోదరులతో నిట్లనెను. మీరుత్వరపడి నాతండ్రియొద్దకువెళ్ళి నీకుమారుడయిన యోసేపుయింక సజీవుడయి అయిగుప్తుదేశమునకు ప్రభువుగాయున్నాడని యతనితో చెప్పుడి. నీవునాదగ్గరకురమ్ము. నీకుకలిగినదియావత్తునాకుసమీపముగా నుండవలెను. నీకు పేదరికము రాకుండునట్లుయిచ్చటనిన్ను పోషించెదనన్నాడని యతనితో చెప్పుడి.

వారాలాగుజేసిరి.

ఆదికా. 45: 1—24.

# XII

# యిశ్రాయేలు సంతతివారు దేశాంతరము వెళ్ళిపోవుట.

1. యోసేపు సహోదరులు యింటికివెళ్ళి తమకు సంభవించినది యావత్తు తమతండ్రికి తెలియచేసిరి. నీకుమారుడగు యోసేపు ఇంక సజీవుడయి అయిగుప్తుదేశమంతటికేలు చున్నాడనిన్ని తనయొద్ద నివసించుటకు నిన్ను రమ్మని పిలుచుచున్నాడనిన్ని వారతనికి తెలియజేసి నప్పుడాయన వారిమాటలు నమ్మకపోయినందున యాకోబు నిర్లక్ష్యముగా నుండెను.

తన్ను యెక్కించుకొని వెళ్ళుటకై యోసేపుపంపిన బండ్లను యాకోబు చూచినప్పుడాయన చాలును, నాపుత్రుడగు యోసేపుయింక సజీవుడయియున్నాడు. నేనుచావకముందువెళ్ళి నతనిచూచెదననెను

2. అప్పుడు యాకోబు తనకు కలిగినదంతటితో కానాను దేశము నుండి బైలుదేరెను. ఒకరాత్రి దర్శనమందు దేవుడతనికిట్లనెను. „యాకోబూ! యాకోబూ! నేనునీతండ్రియొక్క దేవుడను. అయిగుప్తు దేశమునకు వెళ్లుట భయపడకుము. అచ్చటనిన్ను గొప్పరాష్ట్రముగా జేసెదను. నేనుఅయిగుప్తుకు నీతోకూడవచ్చెదను. అంతేకాదు నేనునిశ్చయముగా నిన్నుమళ్ళీ కానానుదేశమునకు

తిరిగిరప్పించెదను"

3. యాకోబు తనసంతతివారితో కూడ ఐగుప్తుదేశమునుసమీపించి వచ్చుచుండగా తనకుముందు యూదాయును తనకుమారుని యోసేపుదగ్గరకు పంపెను- తన తండ్రి తనసంతతివారితో కూడా వస్తావున్నారన్న సంగతియోసేపువినినప్పుడాయన తనరధముసిద్ధముగా జేయించి వారినికలుసుకొనుటకయి బయలుదేరెను. వారిసెదురుకొనినప్పుడు యోసేపు ముసలవాడయిన తనతండ్రిని చూచుచుండగానే నతని కౌగలించుకొని యేడ్చెను.

అప్పుడుయాకోబు యోసేపుతో నీవింక సజీవుడవయియున్నావు,నిన్నుమళ్లీ చూచితిని గనుక నేను యికను చావవచ్చునని చెప్పెను.

4. యిశ్రాయేలు కుటుంబికుల డెబ్బదిమందికి ఐగుప్తులోనున్న గోషెనను పరిదేశము స్వాస్థ్యముగానివ్వబడెను. వారచ్చటకాపురము చేసికొనినవారయిరి.

ఆదికా, 45. 47.

నీసంతతివారు తమదికాని పరదేశమునకువెళ్ళి అక్కడనివసించెదరను ఆదికా. 15.. దేవుడువారిమూల పితృడగు అబ్రాహాముతో చెప్పిన మాటలీలాగు నెరవేర్పునొందెను.

# XIII
# యిస్రాయేలు తనపుత్రిల నాశీరివదించుట.

యిశ్రాయేలు విడిచిపోవలసిన సమయమునాయన తనపుత్రిలను

పిలిపించివారినివరుసగాదీవించెను.అతడు యూదాయనువానినిచూచిన తనివిషయమై యిట్లనెను" సమాధాన కర్త వచ్చువరకుయూదాయొద్దనుండి దండమైనను అతనికాళ్ళనుండి రాజదండమైనను తొలగదు. అతనికిప్రజలువిధేయులయి యుందురు,,

మరియుయాకోబుచనిపోయి నప్పుడతని కుమారులతనితీసికొనికానాను దేశమునకు వెళ్ళిఅచ్చటతని పాతిపెట్టిరి.

యోసేపు నూటపదిసంవత్సరములు వాడయినప్పుడాయన చనిపోయెను.

ఆదికా- 50.

# నాలుగవప్రకరణము.

యిస్రాయేలీయులు ఐగుప్తుదేశమునుండి విడుదలై కానాననేదేశమునకు నడిపించబడుటను గురించినది.

అరణ్య ప్రయాణము 40 సంవత్సరములు

## I

## మోషేయొక్క పుట్టుకయు అతడు

# రాజకుమార్తెచే స్వీకరించబడుటయు.

1. యాకోబు చనిపోయిన వెనుక షుమారు మున్నూరేండ్లు యోసేపునెరుగని క్రొత్త రాజు అయిగుప్తునేలెను. మరియు ఇశ్రాయేలీయులభివృద్ధినొంది యత్యధికముగావిస్తరించి యుండిరి. తనశత్రువులతో వారుకలసి తనకువిరోధముగా యుద్ధముచేయుదురేమోయని రాజుభయపడి వారువిస్తరింపకుండునట్లు వారినికఠినముగా హింసింపనారంభించెను గానిరాజువారిని శ్రమపెట్టినకొలది వారెక్కువవిస్తరించిరి.

అప్పుడాయన వారిలోపుట్టిన ప్రతిమగశిశువును బ్రతుకనీయక నదిలోపడవేసి చంపవలెనని తనప్రజల కాజ్ఞయిచ్చెను

2. లేవీగోత్రములో నొకడు వేరొకతన గోత్రములో నొకదానిని వివాహము చేసికొనెను ఆమెగర్భవతియయికుమారునికనెను. ఆకుమారుడు సుందరుడు రాజువానిచంపింపకుండునట్లు తల్లియాపిల్లవాన్ని మూడునెలలుదాచెను. తరువాతనామెయతని దాచలేక, జమ్మునల్ల జేయబడినొక పెట్టెతీసికొని దానికిజిగటమన్నును కీలునుపూసిఅందులో యామగశిశువును పరుండబెట్టి యేటియొడ్డున జమ్ములో యాపెట్టెనుంచి అతనికేమిసంభవించునోయని తెలుసుకొనుటకయి మిర్యాంఅను వాని అక్కనుదూరముగానిలువబెట్టెను.

3. అప్పుడు రాజకుమార్తె స్నానముచేయుటకయి నదికివచ్చి, జమ్ములోని యాపెట్టెనామెచూచి దానితెప్పించుటకై తనపని

కత్తెనుపంపి తెప్పించి దాని తెరచి చూచినప్పు డాపిల్లవాడు ఏడ్చుట
చూచెను. అప్పుడామె వానియందు కనికరించి, వీడు హెబ్రీయులలో
నొకడనెను. అప్పుడు మిర్యాం సంభవించినది చూచి సమయముగు
ర్తెరిగి రాజకుమార్తెతో నిట్లనెను ఏలినవారికొరకుయీపిల్లవాని పెంచు
టకై నేను వెళ్ళి హెబ్రీస్త్రీలలో నొకదానిమాటలాడవచ్చునా అనెను.
అందుకామె వెళ్ళుమనెను. మిర్యాంవెళ్ళి యాపిల్లవానియొక్క త
ల్లిని తీసికొనివచ్చెను. రాజకుమార్తె తల్లినిచూచి యామెతో
యీపిల్లవానితీసికొనివెళ్ళి నాకొరకు వానికిపాలుయిచ్చి పెంచు
ము. నేనునీకుజీతమిచ్చెదననెను. ఆస్త్రీసమ్మతించిఅట్లుచేసెను
ఆపిల్లవాడు నీటిలోనుండి తీసికోబడినందున మోషేయనుపేరు బొం
దెను. ఆయన పెద్దవాడయిన తర్వాత రాజకుమార్తెకు స్వీకపుత
యి యామెకప్పగించబడెను.

నిర్గ. 1

# II

# మోషే మిద్యానను దేశమునకు పారి పోవుటయు యాదేశపు స్త్రీనొకతెను వివాహము చేసికొనుటయు.

1. మోషేనలుబదియేండ్ల వయస్సుగలవాడయి నప్పుడాయనొక నాడు తనసహోదరులయిన హెబ్రీయుల దగ్గరకు పోయిబానిసె వాండ్రివలె వారిని పాటుపడుట చూచెను. అయిగుప్తీయులలో నొ

కడు హెబ్రీయులలోనొకని అన్యాయముగా వానినికొట్టుటచూచి
నప్పుడు మోషేయా ఐగుప్తీయుని చావగొట్టి యిసుకలో వాని
దాచిపెట్టెను.

2. రాజుజరిగినయీ సంగతివినినప్పుడాయన కోపగించి మోషేను
చంపగోరెను. కాబట్టిమోషే పారిపోయి మిద్యానుదేశమునకు వ
చ్చెను. ఆదేశమందు రెగూయేలను యాజకుడొకడుండెను. అత
నికియేడుగురు కూతురులుండిరి. వారిలో సిప్పోరయనుదానిని మో
షే పెండ్లిచేసికొని అచ్చటనలుబది యేండ్లుకాపురముచేసెను.

నిర్గ. 2.

# మోషే యెహోవవలన పిలువబడుట

1. మోషే మిద్యానుయాజకుడయిన తనమామయొక్క మందను
కాచుచుండగా నొకనాడు హోరేబను దేవునియొక్క పర్వతము
నకు వచ్చినప్పుడొక పొదనడుమ యగ్నిజ్వాలలో యెహోవాదూ
తయతనికి కనుబడెను అగ్నివలన యాపొదమండుచుండినను యదికా
లకపోయెను. ఆపొదయేలదహింపబడ లేదోయను గొప్పవింత
చూచెదననుకొని మోషేదానిసమీపించుచుండగా దానినడుమ
నుండియెహోవయతనితో« దగ్గరకురావద్దు. నీవునిలిచియు
న్నస్థలము పరిశుద్ధమైనదిగనుకనీ చెప్పులూడదీయుము
నేనుఅబ్రాహాముయిసాకు,యాకోబుల దేవుడననిపలి

నప్పుడు మోషే తన ముఖము చాటు చేసికొనెను.

మరియు యెహోవ విస్మయకుండా మోషేతో మాటలాడి యతనితో "నేను ఐగుప్తులోనున్న నా ప్రజల బాధను చూచితిని వారి మొరలను వింటిని వారి దుఃఖములు నాకు తెలియును కాబట్టి ఆయిగుప్తు దేశము నుండి వారిని విడిపించుటకై దిగివచ్చి యున్నాను. కాగా నీవు వారిని వెలపలికి రప్పించునట్లు నిన్ను రాజుయొద్దకు పంపుదు ననెను"

రాజు పరాక్రమము నెరింగి అతనియొద్దనుండి యిశ్రాయేలీయులను విడిపించుటకు యితనకలవి గాదని దలచి మోషే ఆశ్చర్యపడి, ఇదుగో నేనెంతమాత్రపువాడ ననెను. అందుకు యెహోవ: "నేను నీకు తోడయి యుందును అయిగుప్తు దేశమునుండి మీరు వచ్చుచుండగా యీ పర్వతముమీద నన్ను సేవించెదర నెను".

2. మరియు యెహోవ మోషేతో నిట్లనెను: "నేను యుండువాడనయి యున్నాను. మీ పితృల దేవుడయిన యెహోవ యను నిరంతరము నా పేరిదే. సర్వశక్తిగల దేవుని వలె వారికి ప్రత్యక్షమయితిని గాని యెహోవా వలె నేను వారికి తెలియబడలేదు. మిమ్ము స్వజనముగా ఏర్పరచుకొని మీకు దేవుడనయి యుందున నెను."

అప్పుడు మోషే లేచి ఐగుప్తుకు తిరిగి వెళ్ళెను.

నిర్గకా. 1. 6.

# IV

# యెహోవ ఐగుప్తుదేశస్తులను హెచ్చరించుట.

1. మోషేఅయిగుప్తదేశమునకుచేరగానే నతడు తనయన్నయయి నఅహరోనును వెంటబెట్టుకొని ఫరో, యనరాజుయొద్దకు బోయి నతనితో వారుయరణ్యమందు నన్నుసేవించునట్లు యిశ్రాయేలీయులకు సెలవియ్యవలెననుటకై యెహోవ మమ్మునుపంపెనని జెప్పిరి అందుకు ఫరో, యెహోవ యెవడు? నేనతనిమాటలు వినవలసినవాడనా? నేనతనినెరుగను. యిశ్రాయేలీయులను పోనియ్యనని పలికెను మోషేయతనియెదుట మహాశ్చర్యాద్భుతములను గొన్నిచేసినను ఫరోయతని మాటలుమనస్కరించక తాను మనోకాఠిన్యమువహించి ప్రజలనుపోనీయ నొల్లకనుండెను

2. అప్పుడుయెహోవ ఐగుప్తీయులను పదంతులుగా దండింపవలసి వచ్చినదట్లనగా

1. తనచేతికర్రను పట్టుకొనియేటినీళ్ళను కొట్టుటకైమోషేకాజ్ఞ యిచ్చెను మోషేయట్లు చేయుచుండగా యవిరక్తముగా మార్చబడెను. చేపలుచచ్చెను. ఐగుప్తీయులు నీళ్ళుత్రాగలేకపోయిరి.

2. మనుష్యులను బాధించునట్లు దేశమంతటి మీదికికప్పలను రాజేసెను.

3. యీ నేలపుధూళినికొట్టి దోమలయ్యేటట్టుగా జేసెను

4. బాధకరములయిన జోరీగలను వ్యాపింపజేసెను.

5. పశువులుచచ్చునట్లు భయంకరమైన తెగులును సంభవింపజేసెను

6. మనుష్యులకును పశువులకును పొక్కులు పొక్కుదద్దురులను పుట్టించెను.

7. నాశకరమైన వడగండ్లనుకురిపించెను

8. మిక్కిలిబాధకరమయిన మిడతలను రప్పించెను.

9. ముట్టతగినంత గాఢాంధకారమైన చీకటిని మూడుదినముల వరకు దేశమంతటిమీద వ్యాపింపజేసెను.

10 ఈశిక్షలు ఐగుప్తుమీదికిపంపబడుచుండగా ఫరో ఆయాకాలములలో నాలుగుపర్యాయములు నాకొరకు ప్రార్థించుడని మోషేతోను అహరోనుతోను మనవిచేసెను. మీరుయీశిక్షను తొలగించిన పక్షమునయిశ్రాయేలీయులను పోనిచ్చెదననెను. వారాయాకాలములలో నాలుగుసారులతనికొరకు ప్రార్థించి బాధను తొలగించిరి గానివారతని బాధయేసమయమున తొలగించిరో యాసమయము నాయన వారినితిరస్కరించి ప్రజలకు సెలవియ్యకయుండెను. అప్పుడుయెహోవ ఐగుప్తుదేశముమీదికింకొక ఘోరమైనటువంటి శిక్షనుపంపెను.

నిర్గ. 7. 10.

# V

# పస్కాగొర్రెపిల్ల.

1. యెహోవ మోషేతో యిట్లనెను. ఫరోమీదికిని అయిగుప్తు మీదికి నింకొకబాధను రప్పించెదను. అటుతర్వాత మిమ్మును వెళ్ళనిచ్చెదరు అర్థరాత్రివేళ నేను ఐగుప్తుదేశములోనికివెళ్ళి సింహాసనముమీద కూర్చున్నఫరోయొక్క తొలిపిల్లమొదలుకొని తిరగలివిసురుగాసియొక్క తొలిపిల్లవరకు దేశమందలి తొలిపిల్లలందరిని చావజేసెదను. అప్పుడు దేశమంతట మహాఘోషపుట్టును. కాబట్టి మీరుతప్పించుకొనునట్లు యొకగొర్రెపిల్లను తీసికొని వధించి మీయిండ్లద్వారములకు దానిరక్తము తాకింపవలెను. యారక్తము నేను చూడగానేమిమ్మునుదాటిపోయి మీయిండ్లకు సంహారకుని వెళ్ళనియ్యకయుందును, ఇదియెహోవయొక్క పస్కా మీరు కనాను దేశములో ప్రవేశించిన తరువాత సహితము దానినాచరించవలెను.యెహోవ ఆజ్ఞాపించిన ప్రకారముగా వారుచేసిరి. ఆపండుగనీసాను నే నెలలో పదనదినమునవచ్చెను.

నిర్గ.11. 12.

# VI

# ఇశ్రాయేలీయులు అయిగుప్తునుండి బైలువెళ్లుట.

• ఆనాటియర్థరాత్రివేళ అయిగుప్తుదేశములో జరిగిన దేమనగా

దేశమందలి తొలిపిల్లలనందరినిన్ని పశువుల తొలిపిల్లల నన్నిటిని న్ని యెహోవహతముజేసెను. యిశ్రాయేలీయులు కాపురము చేసిన గోషెన ప్రదేశములో దప్పదేశమంతటిలో శవము లేనియిల్లుయొక టైనన్ను యుండలేదు.

2. ఆరాత్రివేళ ఫరోజరిగిన దానిచూచియుతడు మోషేనును అహరోనును పిలిపించివారితో యిట్లనెను; మీరులేచి నాప్రజలమధ్య నుండి బైలువెళ్ళుడి. మీరు గోరిన విధముగా వెళ్ళి యెహోవను సేవింపుడి. నన్ను దీవించివెళ్ళుడి. అయిగుప్తీయులు మనమందరము వారి నిమిత్తము చావవలసినవారమనుకొనుచు తమదేశమునుండి యిశ్రాయేలీయులను పంపత్వరపడుచు వారినిబలవంతము జేసిరి.

3. అప్పుడు యిస్రాయేలీయులు పిల్లలు గాక ఆరులక్షలమందిజనులు గోషెను అనే ప్రదేశము నుండిప్రయాణమై బయలుదేరిరి.

వారు రాత్రింబగళ్ళుగూడ ప్రయాణమై వెళ్ళగలిగినట్లు పగటి వేళ మేఘస్తంభములోను రాత్రివేళ యగ్నిస్తంభములోను యెహోవ వారికిముందుగా వెళ్ళుచువారినినడిపించెను. వారుఐగుప్తులో నివసించినకాలము నన్నూటముప్పది సంవత్సరములు.

యెహోవ అబ్రాహాముతో ముందుజెప్పిన మాటలట్లు నెరవేర్పు నొందెను.

(ఆదికా. 15. 17)

నిర్గ. 12. 13

# VII

# యిశ్రాయేలీయులు యెఱ్ఱసముద్రములో బడిదాటి వెళ్లుట.

1 యిశ్రాయేలీయులు ఐగుప్తు దేశమునుండి బయలువెళ్ళినసంగతి ని ఫరో వినినప్పుడతడు తానువారిని వెళ్ళనిచ్చినందున పరితపించుచు తనపరివారజనమును తనసేనలను కూర్చుకొని వారినితరిమి ఎఱ్ఱ సముద్రముదగ్గర కలిసికొనెను. ఫరో యిశ్రాయేలీయులను సమీపిం చుచుండగా వారతని సేనలనుతమవెనుక వచ్చుట చూచినప్పుడు మి క్కిలిభయపడుచు యెహోవాకు మొఱబెట్టుచు మోషేనుచూ చి యతనితో యీ యరణ్యములో చచ్చుటకయిమమ్మునిచ్చుటకు ర ప్పించితివా? మమ్మునిట్లుచేయ నేలయనిరి.

అందుకుమోషే యెహోవ మీపక్షమునయుద్ధముజేయును. కా బట్టి మీరూరకయే యుండవలయుననెను.

2. అప్పుడుయెహోవ మోషేనుచూచినీవేల నాకు మొఱబెట్టుచు న్నావు. సాగిపోవుడని యిశ్రాయేలీయులతో చెప్పుము. నీకఱ్ఱ నెత్తి సముద్రపు వైపున నీచెయ్యిచాపి దానిపాయలు చేయుము.అప్పు డు యిశ్రాయేలీయులు సముద్ర మధ్యము నారిననేలను నడిచిపో వుదురనెను. గనుక మోషే సముద్రపువయిపుతనచెయ్యిచాపగా యె హోవ యారాత్రి యంతయుబలమైన తూర్పుగాలి విసరచేసి సము ద్రమును తొలగించి దానినారిన నేలగాచేసెను. నీళ్ళువిభజింపబడ గాయిశ్రాయేలీయులుసముద్రమునడుమ యారిననేలనునడుచుపోగిరి.

నీళ్ళువారికుడియెడమ ప్రక్కలను వారికిగోడవలె నుండెను. అయి గుప్తీయులు సహితమువారిని వెంబడించి సముద్రమధ్యమందు చేరిరి. అయితే యిశ్రాయేలీయులకు ముందుగానడచిన దేవదూతవారివెను కకు పోయి వారినివెంబడించెను. మేఘస్తంభము వారివెనుక నిలిచి అది యిశ్రాయేలీయుల సేనకును అయిగుప్తీయుల సేనకును న డుమ ప్రవేశించెను గనుకయారాత్రియంతయు అయిగుప్తీయులసే న యిశ్రాయేలీయులను సమీపింపలేదు మరియుఅయిగుప్తీయులు యిశ్రాయేలీయులను తరుముచుండగా వారిరథచక్రములు వీడిపడు నట్లు యెహోవ కలుగజేసెను కాబట్టిబహుకష్టముతోనే వాటిని తోలుచుండిరి.

3 అప్పుడుయెహోవ మోషేతో ఐగుప్తీయులమీదికిని వారిరథము లమీదికిని నీళ్లుతిరిగివచ్చునట్లు సముద్రముపైపున నీ చెయ్యిచాపుమనె ను; మోషేఅట్లు చేసినప్పుడు సముద్రము తన యధికబలముతో తిరి గివచ్చెను-కాబట్టి అయిగుప్తీయులు సముద్రములోనశించిరి. జరిగిన యీగొప్పకార్యమును యిశ్రాయేలీయులు చూచినప్పుడు వారు యెహోవకు భయపడి ఆయనకు కీర్తనపాడిరి.

(నిర్గ. 14, 15)

# VIII

# ఎర్రసముద్రమునుండిసీనాయివరకు ప్రయాణము.

1 మోషే యెఱ్ఱసముద్రమునుండి ప్రజలను సాగజేయగా వారు షూరుయను నెడారణ్యములోకివెళ్ళిరి. అచ్చటవారికినీళ్ళుదొరకలేదు

నిర్గ. 14. 22.

2. యింతలోవారు మారాయనే చోటున చేరిరి. వారు వాటిని త్రాగలేకపోవు నంత చేదయిననీళ్లు అచ్చటనుండెను. వారుమోషేమీదసణుగుకొనగా దేవుడతని కొక చెట్టును చూపెను మోషే యాచెట్టు నీళ్ళలో వేసినప్పుడవి మధురములాయెను.

నిర్గ. 14. 22

3. తరువాతవారు ఏలీముకువచ్చిరి. అక్కడ పది రెండు నీటి బుగ్గలును డెబ్బది ఈత చెట్లుండెను.

నిర్గ. 14 27

4. పిమ్మటవారు ఏలీమునుండి ప్రయాణమై పోయి సీనా యను యరణ్యములోదిగిరి. అచ్చటయిశ్రాయేలీయుల సమాజమంతయు మోషేఅహరోనులయొద్ద సణిగి చెప్పినదేమనగా మేము మాంసమునందుకొనుకుండలయొద్ద కూర్చుండి తృప్తిగా యాహారముతినునప్పుడు మేము యెహోవ చేతివలన ఏలచావక పోతిమి, ఈసర్వసమాజమును కత్తివలన చంపుటకయి ఈయరణ్యములోనికి మమ్మ్రుతోడుకొని వచ్చితిరా? యనిరి

అప్పుడుయెహోవ మోషేతోనిట్లనెను. నేనుప్రజల సణుగులు వింటిని. నీవువారిని చూచిసాయంకాలము మీరుమాంసము తిందురు ఉదయకాలము మీరుయాహారముచే తృప్తిబొందుదురు. అప్పుడు మీదేవుడయిన యెహోవను నేనేయని మీరు తెలిసికొందురని పలుకుమనెను సాంయత్రిముప్పూరేడులువచ్చి వారి పాలెమంతయుకప్పె

ను ఉదయమున మంచువారిపాలెము చుట్టుపడియుండెను అట్లుపడిన యానుంచుకుమన్న యను పేరు పెట్టిరి. అది తెల్లని ధనియాలగింజలవలె నుండెను.

నిర్గ. 16

5. వారుసీనాయనే యరణ్యమునుండి బయలువెళ్ళి రిఫీదిమ్‌యనే చోటుకువచ్చిరి. త్రాగుటకయచ్చటనీళ్ళులేనందున వారు మోషేతో వాదించుచు త్రాగుటకు నీళ్లుమాకిమ్మని పలికిరి. అందుకుమోషే వారి నిమిత్తమై దేవుని ప్రార్థించెను. అప్పుడు యెహోవమోషేతో నీవునదినికొట్టిన నీకర్రనుతీసికొని వెళ్ళి హోరేబులోని బండమీద కొట్టుమనగా, మోషేదానిప్రకారముగా చేసినప్పుడుయా బండలోనుండి నీళ్ళు ప్రవహింప సాగెను.

6. తరువాతఅమలేకీయులు వచ్చియిశ్రాయేలీయులమీద యుద్ధముచేసిరి. మోషేతనచేతులు పైకెత్తినప్పుడు యిశ్రాయేలీయులు ప్రబలించిరి. అతడుతన చేతులు దింపినప్పుడు. అమలేకీయులు ప్రబలించిరి కాబట్టిఅహరోను హూరులు, ఒకడీపక్కను ఒకడాపక్కను యతనిచేతు లెత్తిపట్టిరి. ఆయుద్ధము జరిగినతర్వాత యిశ్రాయేలీయులు రిఫీదిమ్‌నుండి బయలువెడలి సీనాయికివచ్చి, అచ్చట పర్వతమునెదుట విడిసిరి.

నిర్గ. 16. 17. 18. 19

# IX

# యెహోవా యిశ్రాయేలీయులతో నిబంధన చేయుట.

ఆపర్వతమునుండి యెహోవ యిశ్రాయేలీయులతో మాట్లాడి చెప్పినదేమనగా: నాయొద్దకు మిమ్ము నెట్లు చేర్చుకొంటినో మీరు చూచితిరి. "కాగా మీరు నా మాటలు శ్రద్ధగా విని నా నిబంధన నగైకొనిన పక్షమందు మీరు సమస్త దేశజనములలో నాకు స్వకీయ సంపాద్యమై యుందురు. మీరు నాకు యాజకరాజ్యము పరిశుద్ధరాష్ట్రము నైయుందురు"

నిర్గ 19. 5

"యెహోవ భూమిమీదనున్న సమస్తజనములలో నుండి తనకుస్వకీయజనముగా మిమ్ము నేర్పరచుకొనెను"

ద్వితీ. 7. 6. 14. 2

2. వారుతాము పరిశుద్ధపరుచుకొనవలెనని యెహోవవారి కాజ్ఞాపించెను. మరియు యెహోవయాపర్వతముమీదకు వచ్చెను. అప్పుడు యురుములు, మెరుపులు సాంద్రమేఘములు, బూరయొక్క మహా ధ్వనియుకలిగెను ప్రజలందరు పర్వతదిగువన నిలుచుండి వణికిరి. యెహోవవారితో నిటనెను:

(1) నేను నీదేవుడనైన యెహోవను. నాసన్నిధిని వేరొక దేవుడు నీకుండకూడదు.

(2) విగ్రహారాధన జేయకూడదు.

(3) దేవునినామము వ్యర్థముగా పలుకకూడదు.

(4) సబ్బాతుదినమును పరిశుద్ధముగా నాచరించుటకు జ్ఞాపకముంచుకొనుము.

(5) తల్లి దండ్రులనుఘనపరుపవలెను.

(6) నరహత్యచేయకూడదు.

(7) వ్యభిచారము చేయకూడదు.

(8) దొంగిలింపకూడదు.

(9) నీపొరుగువానిమీద అబద్ధపు సాక్ష్యము పలుకకూడదు.

(10) నీపొరుగువానికి గలిగినది యేదైనా ఆశింపకూడదు. నిర్గ. 19 20

1. యీపది ఆజ్ఞలను దేవుడు రెండు రాతిపలకలమీద వ్రాసెను. అప్పుడు ప్రజలు భయపడుచు మోషేతో యిట్లనిరి. నీవు మాతో మాటలాడుము, మేము చాఽకయుండునట్లు, దేవుని మాతో మాట్లాడనియ్యకుము, అందుకు మోషే భయపడకుడి, మిమ్మును పరీక్షించుటకు మీరు పాపము చేయకుండునట్లు, ఆయన భయము మీయెదుట యుంచునట్లు గేవుడువచ్చెనని వారితో పలికెను.

3. అచ్చట యెహోవ యిశ్రాయేలీయులతో నీలాగనెను త్రోవలో మిమ్మును కాపాడి నేను మీకొరకు సిద్ధపరచిన చోటకు కనాను దేశమునకు మిమ్మును రప్పించుటకై నొకదూతను మీకుముందుగా పంపుచున్నాను" యెర్రసముద్రమునుండి ఫిలిస్త్రీయుల సముద్రము వరకును యరణ్యమునుండి(యూఫ్రాత్ యనే) నదివరకు మీపొలిమేరలను యేర్పరచెదను,,

ఆదేశ నివాసులను మీచేతికప్పగించెదను.

నిర్గ. 20 23

యెహోవ శబ్దప్రమాణముగా పలికిన మాటలన్ని మోషే వ్రాసియా కొండ దిగుఽను యజ్ఞవేదికనుకట్టి యిశ్రాయేలీయుల పదిరెండుగోత్రములచొప్పున పదిరెండు స్తంభములనచ్చట నిలువబెట్టెను.

4. మరియు యెహోవ మోషేతో యిట్లనెను,, నీవు పర్వతమెక్కి నాయొద్దకువచ్చియుండుము. ప్రజలకు వాటిని బోధించునట్లు నేను వ్రాసిన యాజ్ఞలను, బోధలను రాతిపలకలను నీకిచ్చెదను

అప్పుడు మోషే పర్వతమెక్కెను. మేఘము దానిమీద నిలిచెను. యెహోవాయొక్క తేజస్సు దానినిక్రమ్మెను.

దేవునిమహిమ దహించుయగ్నివలె ప్రజలకన్నులకు గానబడెను. అప్పుడుమోషే యామేఘములో ప్రవేశించి పర్వతముమీద రేయింబగళ్ళునలుబదిరోజులుండెను.

# X

## ఇశ్రాయేలీయులు భ్రష్టులయియెహోవామార్గమునుండితొలగిపోవుట.

1 మోషే పర్వతము దిగకుండా తడువుచేయుట ప్రజలుచూచి నప్పుడు వారుఅహరోను నొద్దకువచ్చి మాముందరనడుచుటకై ఒకదేవతను మాకొరకుచేయుము ఐగుప్తునుండి మమ్మును రప్పించినయా మోషేయనువాడు ఏమాయనోమాకు తెలియదని చెప్పిరి. అందుకతడు వారియొద్ద బంగారముతీసి పోకరతో రూపమేర్పరచి దానిపోతపోసిన దూడనుగా చేసెను. అప్పుడువారు యాదేవతనుచూచి ఓయి యిశ్రాయేలూ ఐగుప్తుదేశములో నుండినిన్ను రప్పించిననీదేవుడు యీదేవుని చెప్పిదానికొరకు బలిపీఠముకట్టి బలులనిచ్చిరి.

2. మోషేశాసనముగల ఇరుప్రక్కలను వ్రాయబడిన రెండుపలకలను చేతపట్టుకొని పర్వతముదిగినప్పుడు యాదేవతను చూచుచుం

డగా అతనుకోపముతోయుండెను. అతడుతనచేతులలో నుండియా
పలకలను పడవేసివాని పగలగొట్టి వారుకల్పించిన యాదూడనుతీ
సికొని అగ్నిలోకాల్చి దాని పొడిచేసి నీళ్ళమీదచల్లి యిశ్రాయేలీ
యులచేత దాని త్రాగించెను.

3. వారుఆబంగారపు దూడనుకల్పించి సేవించిన దోషమునుబ
ట్టి యిశ్రాయేలీయులను నశింపజేసెదనని దేవుడుబెదరించెను గనుక
మోషే మళ్ళిపర్వతమెక్కి యెహోవయొద్దకువెళ్ళిఅయ్యోయీప్ర
జలు గొప్పపాపముచేసిరి వారుబంగారపుదేవతను తమకొరకు చేసి
కొనిరి. గానినీవువారిపాపమొక వేళపరిహరించితివా? సరిలేనియెడ
ల నీవువ్రాసిన నీగ్రంధములోనుండి నాపేరు తుడిచివేయుమనిబ్ర
తిమాలుకొనెను.

4. ప్రజలు సంతాపమునొంది తమపాపమొప్పుకొని నప్పుడు దే
వుడువారి అక్రమమును క్షమించెను.

నిర్గ. 32

# XI

## ఆరాధనయొక్క యేర్పాటు.

నిర్గ లేవీ సంఖ్యా ద్వితీయోకాండములలో వివరించబడినది.

1. గుడారము.

మరియుయెహోవ సీనాయి పర్వతమువద్ద మోషేతో నిర్గ. 25
యిట్లనెను: మనఃపూర్వకముగా నర్పించు ప్రతిమనిషిదగ్గర నీవునా
కొరకు కానుకలు తీయవలెను యెందుకనగా; "నేనుమీతో స

హా వాసము చేయుచున్నట్లు మీయునాకొరకొక పరిశుద్ధస్థలము నిర్మింపవలెను." యెహోవ యతనికి చూపించిన విధముగా మోషే యొక గుడారము చేయించెను. దాని పొడుగు ముప్పది మూరలును వెడల్పు పదిమూరలును ఎత్తు పదిమూరలును చేసెను గుడారము నడుమ తెరవేయించి దాని రెండు భాగములుగా యేర్పాటు చేసెను. ఆ రెండు భాగములలో, ఒక దానికి పరిశుద్ధయిల్లను పేరు పెట్టెను.

1. పరిశుద్ధయింటిలోని యుపకరణము లేవనగా. ధూప వేదికయు సన్నిధి రొట్టెలబల్లయు బంగారపు దీపవృక్షమును

నిర్గ. 25

2. పరిశుద్ధయింటిలోని యంతఃపురమందు నిబంధన పెట్టెనుంచిరి. ఆ పెట్టెయొక్క పొడుగు రెండు మూరలనర ఎత్తు ఒకటిన్నర మూర వెలపలను లోపలను అది బంగారు రేకుతో పొదిగింపబడినది. దేవుడు వ్రాసిన పలకలను దానిలోనుంచిరి. మేలిమిబంగారుతో ఆ పెట్టెకు మూతచేసిరి. కరుణా పీఠము యని యామూతకు పేరు

ఆ కరుణాపీఠముయొక్క రెండుకొనలవద్ద ఆ ప్రక్క నొకడును యీ ప్రక్క నొకడును రెండు కెరూబులను దానితో ఏకాండముగా చేసిరి.

ఆ కెరూబులకు నడుమ యెహోవ యిశ్రాయేలీయులకు తన్నుతాను ప్రత్యక్షపరచుకొనెను.

నిర్గ. 25

3. గుడారము చుట్టు నూరుమూరల పొడుగును ఏబది మూరలు

వెడల్పుసుగల యోగ్యరణముకట్టిరి. అదిపేనివసన్నపువారచేచేయబడి నరదహన వేదికను గంగాళమును అచ్చటనుంచిరి.

నిర్గ. 27. 9. 30. 18

4. ప్రత్యక్షపు గుడారము.

మోషే యొకగుడారము తీసికొని పాలెమువెలపలికి వెళ్ళిపాలెమునకుదూరముగాదానివేసిదానికిప్రత్యక్షపుగుడారమను పేరుపెట్టెను. దేవునివెదకిన ప్రతివాడును యాగుడారమునకు వెళ్ళ వచ్చెను. మోషేయాగుడారమునకు వెళ్ళినప్పుడు మేఘస్తంభముదిగి యాగుడారపు ద్వారమందు నిలువగాయెహోవ మోషేతో మాట్లాడెను. ప్రజలందరు యా మేఘస్తంభము చూడగావారు లేచిప్రతివాడు త న తన గుడారపు ద్వారమందు నమస్కారముచేసెను. మరియు „మనుష్యుడుతన స్నేహితునితో మాటలాడునట్లు దేవుడు మోషేతో ముఖాముఖిగా మాటలాడెను."

నిర్గ. 33. 7. 11

2. అర్చకులు.

గుడారములోపరిశుద్ధసేవ చేయుటకయి యెహోవలేవీగోత్రము నేర్పర్చి యాగోత్రములోనుండి అహరోనుయొక్క సంతతివారిని అర్చకులగా నిర్ణయించెను. అహరోను ప్రధానయాజకుడాయెను.

వారునీళ్ళవల్ల కడుగబడియును తైలమువల్ల నభిషేకింపబడియును రక్తమువల్ల చిలకరింపబడియును యెహోవకు హోమముచేసిన వారయి గుడారపుసేవలోప్రవేశింప తగినవారుగా నంగీకరింప బడుచు వచ్చిరి.

నిర్గ. 29

అర్చకులయొక్క నుద్యోగము యేదనగా అర్పితములను సమర్పించుటయును యెహోవకు ప్రార్థనచేయుటయునుధర్మశాస్త్రము ను ప్రజలకు నేర్పించుటయును.

యిశ్రాయేలీయుల దేశములో వారికి స్వాస్థ్యములేదు పాలులేదు గాని దేవుడు వారికిచ్చినవాగ్దాన మేమనగా "నీస్వాస్థ్యమునునీ పాలును నేనే" వారుచేసినకుడారపు కొలువుకు యిశ్రాయేలీయులయొక్క దశమభాగములన్ని వారికి స్వాస్థ్యముగా నిచ్చిరి.

సంఖ్యా. 18

ప్రొద్దునను సాయంకాలమునను వారుప్రజ ను దీవించిచెప్పునదే మనగా "యెహోవనిన్ను ఆశీర్వదించి నిన్నుకాపాడుగాక యెహోవ నీకుతన సన్నిధిప్రకాశింపజేసి నిన్నుకరుణించుగాక యెహోవనీమీాద తనసన్నిధికాంతిను దయింపజేసి నీకుసమాధానము కలుగజేయునుగాక."

## 3. అర్పణములు.

పాపమనేమహాఅగాధమువలనదేవునియొద్దనుండిమనుష్యులు వేరు పర్చబడిన యనుభవముచే వారాయనతో ఆత్మార్థమయిన సహవాసము పొందుటకయి ప్రార్థన సాధనమనిగెంచిరి. వారుప్రార్థ న మూలముగా ఆయనను సమీపించుచుండగా పట్టిచేతులతో ఆయన సన్నిధికి ప్రవేశింపతగదని యెంచుచు అర్పితము లిచ్చిరి "వారుఅర్పణములిచ్చి దేవునిపేరట ప్రార్థించిరి,, (ఆదికా. 13. 4 గనుక అర్పణ ప్రార్థనయే.

యెహోవ యిశ్రాయేలీయులతో చేసిన నిబంధనఅర్పణముల లవస్థాపింపబడియుండెను. యెహోవవారితో సెలవిచ్చిన దేమనగా:
నాసన్నిధిని ఎవడును వట్టిచేతులతో కనబడకూడదు

నిర్గ. 123 15

దేవుని ఏర్పాటుపరికారముగా వారు యర్పించిన యర్పణము లేవనగా,,

1. ప్రాయశ్చిత్తార్పణము

(1) పాపపరిహారార్థబలి (లేవీ. 4. 3)

(2) అపరాధపరిహారార్థబలి (లేవీ. 5. 15)

2. దహనబలి! (లేవీ. 1. 3)

3. సమాధానబలి (లేవీ. 3 1)

(1) కృతజ్ఞతార్పణము (లేవీ. 7. 11. 12)

(2) మ్రొక్కుబడు యర్పితము (లేవీ. 7. 16)

(3) స్వేచ్ఛార్పితము లేవీ. 7. 16)

4. నైవేద్యమును (లేవీ. 2. 1) పానార్పణమును (సంఖ్యా. 15. 5 ప్రతిష్ఠార్పణము (సంఖ్యా. 31. 29) అల్లాడింపబడిన యర్పణమును (లేవీ. 7. 30)

4. సబ్బాతులు.

(1) వారము వారము ఏడవదినము విశ్రాంతిదినము (లేవీ. 233) అది సబ్బాతుదినమనబడెను.

(2) ఏడవఏడవసంవత్సరము భూమికివిశ్రాంతిసంవత్సరముండెను. అప్పుడు వి త్తనములు వేయక యుండిరి. ఆసంవత్సరమునకు సబ్బాతుసంవత్సరమను పేరు. (లేవీ. 25. 4. 8)

(3) ఏడు విశ్రాంతి సంవత్సరములను అనగా ఏడేసి యేండ్లుగల సంవత్సరములను లెక్కించి—ఆఏడవసంవత్సరకాలము నలుబదితొమ్మిది. సంవత్సరములాయెను.

వారు ఏబదియవ సంవత్సరమును పరిశుద్ధపరచిరి. ఆసంవత్సరము వారికి సునాదకాలమాయెను. (లేవీ. 25. 8. 12)
దానిశ సేవచేసిన వారు అప్పుడు స్వతంత్రులనుగా జేయబడిరి. (లేవీ. 25 10. 39. 41)
తాకట్టు పెట్టబడిన యాస్తినంతయు విడిపించబడెను. లేవీ. 25. 14. 34)

5. ఉత్సవములు.

A. సబ్బాతుదినముయొక్క నిర్ణయముతోడ సంబధమైన వుత్సవములు

1. సబ్బాతుదినము (లేవీ. 23. 3)

2. ఏడవ మాస మెల్ల (లేవీ. 23. సంఖ్యా 29) మొదటిదినము శృంగ ధ్వని దినము అప్పుడు సబ్బాతునెల వచ్చినట్టు గురుతుగా యాజకులు బూరలనూదిరి.

3. విశ్రాంతి సంవత్సరము (లేవీ. 25. 3. 4

4. సునాదిసంవత్సరము. (లేవీ. 25. 8. 12)

B. ప్రతిసంవత్సరమువచ్చిన పస్కాను, వారముల పండుగను, పర్ణశాలలపండుగను యనే మహోత్సవములు.

1. పస్కాయనుపండుగ యెహోవ వారిని ఐగుప్తునుండి విడిపించిన సంగతిని జ్ఞాపకము చేసికొనుటకై ఆచరించిరి. మొదటినెల (ఏప్రిల్) పదునాల్గవరోజు నాపండుగ వచ్చెను. ఒక గొర్రెపిల్లను వధించి దానిరక్తమును తమయిండ్లకు తాకించిరి. (నిర్గ. 12) (ద్వితియో. 16 "క్రీస్తు యనే మన పస్కాగొర్రెపిల్ల మన నిమిత్తము వధింపబడెను" (1.కొరి. 5. 7)

2. వారముల పండుగ.

పస్కాయను పండుగ మొదలుకొని ప్రతిసంవత్సరము కోతకాలము యారంభమాయెను. ఏడువారముల కోతకాలము వచ్చెను. పస్కానే పండుగ మొదలుకొని నలుబదితొమ్మిది రోజులు లెక్కించి ఏబదియవ దినము వారములపండుగయను మహోత్సవము నాచరించుచు వచ్చిరి కోతకాలమున కాపండుగ ముగింపు దానికి వెన్వేరు పేర్లేమనగా తొలిపంటయొక్క కోతపండుగను. (నిర్గ. 23. 26) నిర్గ. 23. 16.

ప్రథమఫలముల నర్పించు దినమును (సంఖ్యా. 28. 26.)
పెంతెకోస్తను పండుగను

3. పర్ణశాలల పండుగ. ఫలసంగ్రహపు పండుగయను దానికి వేరొకపేరు. (నిర్గ. 23. 16.) యేడవనెల పదునైదవ దినము మొ

దలుకొని యేడుదినములవరకు యీపండుగ జరిపిరి. యెహోవ వారిని ఐగుప్తునుండి రప్పించినప్పుడు వారు పర్ణశాలలలో నివసించిరని జ్ఞాపకార్థముగా యీపండుగ నాచరించిరి.

C. ప్రాయశ్చిత్తార్థ దినము.

ఏడవనెల పదియవనాడును ప్రతిసంవత్సరము ప్రత్యేకదినముగా వారాచరించుటకద్దు. ఆదినమున ప్రధానయాజకుడు రెండు మేకపోతులను తీసికొని వాటిలో నొకటిని పాపపరిహారార్థబలిగా సమర్పించి నొకటిమీద ప్రజలపాపము మోపి దానినరణ్యములోకి తొలగించెను. ఆదినమున ప్రధానయాజకుడు యతి పరిశుద్ధయింటిలో ప్రవేశించి పాపపరిహారార్థ బలియొక్క రక్తమును కరుణాపీఠముపై ప్రోక్షించెను. యెహోవ యీలాగు సెలవిచ్చెను.

«మీరు యెహోవసన్నిధిని మీసమస్త పాపములనుండి పవిత్రులగునట్లు ఆదినము నతడు మిమ్మును పవిత్రపరచునట్లుమీ మీనిమిత్తముప్రాయశ్చిత్తము చేయును.,' (నిర్గ. 16.)

క్రీస్తు మన పాపములకు ప్రాయశ్చిత్తమయి యున్నాడు. (1 యోహా. 2. 2.)

దేవుడు క్రీస్తునందు లోకమును తనకు సమాధానపరచుకొనెను. గనుక దేవునితో సమాధానపడుడి (2. కొరి. 5. 19. 20.)

D. యిశ్రాయేలీయులు చెరనుండి వచ్చినవెను పూరీమ్ యను పండుగను (ఎస్తే. 9.) ప్రతిష్ఠితపండుగను (యోహా. 9: 22) స్థాపించబడెను.

# XII

## క్రొత్తపలకలు.

1. మరియు యెహోవా మోషేనుచూచి మొదట పలకలవంటి మరి రెండు రాతిపలకలను చెక్కుము. నీవు పగలగొట్టిన మొదటి పలకల మీదనున్న నావాక్యములను నేను యీపలకలమీద వ్రాసెదననెను. కాబట్టి మోషే రెండుపలకలనుచెక్కి వాటిని చేతపట్టుకొని కొండనెక్కగా మేఘములో యెహోవ దిగి యచ్చట నాతనితోనిలిచి యెహోవాయను నామమును ప్రకటించెను. అతనియెదుట యెహోవ దాటివెళ్ళుచు „యెహోవ కనికరముదయ దీర్ఘశాంతములు విస్తారమైన కృపాసత్యములుగల దేవుడయిన యెహోవా. ఆయన వేయివేలమందికి కృపనుచూపుచు దోషమును, అపరాధమును, పాపమును క్షమించును. అయితే ఆయన ఏమాత్రము దోషులను నిర్దోషులుగా నెంచక మూడు, నాలుగుతరములవరకు తండ్రుల అక్రమమును కుమారులమీదికిని కుమారుల కుమారులమీదికిని రప్పించును.” యని ప్రకటించెను.

2 మరియు మోషే నలుబదిరాత్రింబగళ్ళు యెహోవతోకూడ యీకొండమీదనుండెను. అతడు భోజనము చేయలేదు. నీళ్ళుత్రాగలేదు. అంతలో ఆయన పదియాజ్ఞలను క్రొత్తగా యీపలకలమీద వ్రాసెను.

మోషే యాపలకలను చేతపట్టుకొని కొండనుదిగుచుండగా యతని ముఖచర్మము ప్రకాశించెనుగాని యాసంగతి యతనికి తెలిసియుండలేదు.

నిర్గ. 34.

# XIII

## ఆశీర్వాదము: శాపములు.

### 1. ఆశీర్వాదములు.

యెహోవ సీనాయికొండమీద మోషేకు నీలాగున సెలవిచ్చెను.

1 చెక్కిన ప్రతిమలను గాని బొమ్మలనుగాని మీరు నిలువబెట్టకూడదు. నేనే మీదేవుడను. మీరు నాఆజ్ఞలనుసరించి నడిచినయెడల మీవర్షాకాలములలో మీకువర్షమిచ్చెదను. మీభూమి పంటలిచ్చును. అప్పుడు నేను మిమ్మునుకటాక్షించి మిమ్మును విస్తరింపచేసి మీతట్టుకువచ్చి నేను మీతో చేసిన నిబంధన నుండనిచ్చెదను. (లేవీ.26:1—13.) అప్పుడుపట్టణములో దీవింపబడుదురు, పొలములో దీవింపబడుదురు,మీగర్భఫలము, భూఫలము, మీబశువుల మందలు మీగొఱ్ఱెమేకల మందలును దీవింపబడును. మీరులో పలికి వచ్చునప్పుడును వెలుపలకు వెళ్ళునపుడుమదీవింపబడుదురు. మీకొట్లలోనుమీరుచేయుప్రయత్నములన్నిటిలోనుమీకు ఆశీర్వాదము కలుగునట్లుయెహోవఆజ్ఞాపించును. (ద్వితీయో.28-2-8 (లేవీ. 26:1—13)

### 2. శాపములు

మీరు నామాటలు వినని పక్షమందు నేను మీకు చేయునదేమన

గా మీకన్నులను క్షీణింపచేయునట్టియు ప్రాణము నాయాసపర చునట్టియు తాపజ్వరమును క్షయరోగమును మీమీదికి రప్పించెదను. మీరు విత్తినవిత్తనములు మీకువ్యర్థములగును. నేను మీకు పగవాడనౌదును. మీవిరోధులు మిమ్ము నేలుదురు. ఇవన్ని సంభవించినను మీరునామాటలువిననియెడల నేనుమీపాపములను బట్టి మరి ఏడంతలుగా మిమ్మును దండించెదను. "మీదేశమును పాడుచేసెదను. జనములలోకి మిమ్మును చెదరగొట్టెదను." (లేవీ. 26: 14—33)

3. అయితేవారు తన శత్రువుల దేశములోనున్నప్పుడు వారిని నిరాకరించదను. నేనువారిపూర్వీకులతో చేసిననిబంధన జ్ఞాపకముచేసికొందును.„(లేవీ.26. 44, 45)

# XIV

## కాదేషుబార్నేయ.

1. రెండవసంవత్సరము రెండవనెలలో ప్రజలు సీనాయినుండి సాగిరి. మరియు మేఘస్తంభముక్రిందయెహోవ వారిని నడిపించెను. పారాను యరణ్యమందు కాదేషుబార్నేయ అనేకనాను దేశమునకు సమీపముగానున్న నొకచోటులోదిగిరి.కనాను దేశమును సంచరించి చూచుటకైపన్నెండుమంది వేగులవారిని మోషేఅచ్చటనుండిపంపి వారితో చెప్పినదేమనగా:—ఆదేశము ఎట్టిదో దానిలోనివసించు జనము బలముగలదోబలములేనిదోకొంచెమెనదో విస్తారమెనదో వారు

నివసించు పట్టణము లెట్టివో వారు గుడారములలో నివసించుచు న్నారో కోటలలో నివసించుచున్నారో ఆభూమి సారమైనదో నిస్సారమైనదో కని పెట్టవలెను' అంతటవారట్లు ప్రయాణము చేసి నలుబది దినములు కనాను దేశమును సంచరించి చూచి తిరిగివచ్చి తెలియపరచినదేమనగా ఆదేశము పాలు తేనెలు ప్రవహించుదేశమే. అయితే ఆదేశజనులు బలవంతులు. వారిపట్టణములు ప్రాకారములుగలవి. అవి మిక్కిలి గొప్పవి. ఆదేశస్థులు యున్నతదేహులే మేము వారిని చూచినప్పుడు మేము మాదృష్టికి మిడతలవలె నుంటిమి. వారు మనుష్యులను భక్షించువారు మనకంటె బలవంతులు. మనము వారిమీదికి పోజాలమనిరి.

2. ప్రజలు ఆదుర్వార్తను వినుచుండగా వారు ఎలుగెత్తి యేడ్చి మోషే అహరోనులపైని సణుగుకొని మనము నాయకునొకనినియమించుకొని అయిగుప్తుకు తిరిగి వెళ్లుదుమని యొకనితో నొకడు చెప్పుకొనుచుండగా కనాను దేశమును సంచరించిచూచిన వేగులలో ఇద్దరు, యెహోషువ కాలేబులను వారిట్లనిరి మేము సంచరించిన దేశము మిక్కిలి మంచిదేశము. యెహోవ మనయందుఆనందించినయెడల యాదేశమును మనకిచ్చును. కాలేబు మనమునిశ్చయముగా వెళ్లుదుము, ఆదేశమును స్వాధీనపరచుకొందుము. దానిజయించుటకు మనశక్తిచాలుననెను. గనుక ప్రజలు తాము యెహోషువను కాలేబును రాళ్లతో కొట్టి చంపవలెననగా యెహోవ మహిమ ప్రత్యక్షపు గుడారములో వారందరికి కనబడినంగున వెనుకతీసిరి.

3. అప్పుడు యెహోవ మోషేతో నిట్లనెను: నేను అయిగుప్తులోను, యరణ్యములోను చేసిన సూచక క్రియలను నామహిమను చూచిన

# XV
# ఇత్తడి సర్పము.

1. వారు ఎదోము దేశమును చుట్టిపోవలెనని హోరుకొండనుండి ఎఱ్ఱసముద్రపుమార్గముగా సాగినప్పుడు మార్గాయాసముచేత జనుల ప్రాణము సొమ్మసిల్లెను. కాగా ప్రజలు మోషేకు విరోధముగా మాట్లాడి యీ అరణ్యములో చచ్చుటకు ఐగుప్తునుండి మమ్ము నెందుకు రప్పించితివి?

ఇక్కడ ఆహారములేదు నీళ్ళులేవు చవిసారములులేని యీ ఆహారము మాకు అసహ్యమైనదనిరి. అందుకు యెహోవా ప్రజలలోనికి తాపకరములయిన సర్పములను పంపెను. అవి వారినికరువగా వారిలో అనేకులు చనిపోయిరి.

2. కాబట్టి ప్రజలు మోషేయొద్దకువచ్చి — మేము నీకు విరోధముగా మాటలాడి పాపముచేసితిమి. యెహోవా యీసర్పములను తొలగించునట్లు ఆయనను వేడుకొనుమనిరి. మోషే ప్రజలకొరకు ప్రార్థన చేయగా యెహోవా యతనితో నీవు తాపకరమైన సర్పమొకటి చేయించి స్తంభముమీద పెట్టుము.
కరువబడిన ప్రతివాడు దానివైపు చూచినయెడల బ్రతుకునని సెలవిచ్చెను.
కాబట్టి మోషే ఇత్తడిసర్పమొకటి చేయించి స్తంభముమీద దాని నుంచెను.

సర్పపుకాటు తినినప్రతివాడు యీఇత్తడిసర్పమును నిదానించి చూచినందున బ్రతికెను. (సంఖ్యా 21)

(యోహాను 3. 14)

# XVI.

# ఆశ్రయపురములు.

మరియు యెహోవా మోషేకీలాగు సెలవిచ్చెను: మీరు యొర్దానుదాటి కనానుదేశములోనికి వెళ్ళినతరువాత యాశ్రయపురములుగా నుండుటకు పురముల నేర్పరచుకొనవలెను. పొరపాటున నొకని చంపినవాడు వాటిలోనికి పారిపోవచ్చును. తీర్పుపొందుటకై నరహంతకుడు సమాజము నెదుట నిలుచువరకు వాడు మరణశిక్షనొంద కూడదు గనుక ప్రతిహత్యచేయువాడు రాకుండ అవి మీకు యాశ్రయపురములుగా నుండును. (సంఖ్యా. 35.)

కనాను స్వాధీనపరచుకొనిన పిమ్మట ఆరు ఆశ్రయ పురములను నియమించిరి. (యెహో. 20.)

# XVII.

# మోషే అహరోనులు మెరీబయొద్ద తిరుగుబాటుచేయుట.

1. నలుబదియవ సంవత్సరమున ఇశ్రాయేలీయులు సీన్ అను అరణ్యమునకు తిరిగిరాగా కాదేషులోదిగిరి. అక్కడ నీళ్ళులేకపోయినందున వారు మోషే అహరోనులకు విరోధముగా పోగైరి. అంతట యెహోవా మోషేతో నిట్లనెను: నీవును అహరోనును ప్రజలను పోగుచేసి వారికన్నులయెదుట బండతో మాటలాడుడు అది నీళ్ళ నిచ్చును. వారు సమాజమును బండయెదుట పోగుచేసినప్పుడు మోషే ప్రజలను చూచి—ద్రోహులారా మేము యీ బండలోనుండి మీకొరకు నీళ్ళు రప్పింపవలెనా యనిచెప్పి తనచె

య్యి ఎత్తి రెండుమారులు బండమీద తన కఱ్ఱతో కొట్టగా నీళ్ళు
సమృద్ధముగా ప్రవహించెను. యెహోవ సెలవిచ్చిన విధముగా
అతడు చేసియుండలేదు.

2. అప్పుడు యెహోవ మోషే అహరోనులను చూచి—మీరు యిశ్రా
యేలీయుల కన్నులయెదుట నా పరిశుద్ధతను సన్మానించునట్లు నన్ను
నమ్ముకొనక పోతిరి గనుక మీరు యీ సమాజమును నేను వారికి
చ్చిన దేశములోకి తోడుకొని పోరని వారితో చెప్పెను. (సంఖ్యా 20
ప్రజలు కాదేషునుండి హోరుకొండ పర్వతమునకు వచ్చినప్పుడు అ
హరోను చనిపోయెను.

# XVIII.

# కనాను నివాసులు తమ దేశమునుండి వెళ్లగొట్టబడిన కారణములు.

యెహోవ మోషేకు ఈలాగున సెలవిచ్చెను: నీవు యిశ్రాయేలీయుల
తో చెప్పవలసినదేమనగా కనానుదేశములో నీవు ప్రవేశించిన త
రువాత ఆ దేశనివాసులు చేయు హేయకృత్యములను మీరు చేయ
నేర్చుకొనకూడదు. తన కుమారునైనను తన కుమార్తెనైనను యగ్ని
గుండా దాటించు వానినైనను, శకునము చెప్పు సోదెకానినైనను,
మేఘశకునములను చెప్పువానినయినను సర్పశకునములను చెప్పువా
నినైనను చిల్లంగివానినైనను మాంత్రికునినైనను ఇంద్రజాలకుని
నైనను కర్ణపిశాచిపడుగువానినైనను దయ్యములయొద్ద విచారణచే
యువానినైనను మీమధ్యనుండనియ్యకూడదు. వీటిని చేయు ప్ర
తివాడును యెహోవకు హేయుడు. ఆ హేయములయినవాటి
నిబట్టి నీదేవుడయిన యెహోవ వారి దేశమునుండి

వారిని వెళ్ళగొట్టుచున్నాడు,, (ద్వితీ. 18)

ఏవిగ్రహమును నీవు నిలువబెట్టకూడదు, నీ దేవుడయిన యెహోవ విగ్రహములను ద్వేషించుచున్నాడు:—ఆజనముయొక్క చెడుతనమునుబట్టియెహోవ మీపితురుల కిచ్చిన ప్రమాణమును స్థాపించుటకై వారు నీయెదుటనుండి వెళ్ళగొట్టబడుదురు. ఆదేశము అపవిత్రత గలది గనుకనది తన నివాసులను వెళ్ళగక్కివేయుచున్నది. (లేవీ. కాం. 18, ద్వితీ. 18, ద్వితీ. 9)

# XIX

## మోషే మరణ మొందుట.

లోకమునకు గొప్ప ప్రవక్త వచ్చునని మోషే ప్రకటించి, ప్రజలను హెచ్చరించిదీవించెను. చివరకు మోషేపిస్గాకొండనరకు జని నెబో శిఖరమున కెక్కెను. అది కనాను పొలిమేర యెదుటనుండెను. అచ్చటనుండి యెహోవ నతనికి కనానుదేశమును చూపించి చెప్పినదేమనగా నేను నీపితురులకిచ్చిన దేశమదే కన్నులార నిన్ను దానిచూడనిచ్చితినికాని నీవు అక్కడికి వెళ్ళవలదు. మరియు మోషేమృతిబొంది పాతిపెట్టబడెను. అతని సమాధియెక్కడ నున్నదో నేటివరకు నెవరు నెరుగరు. (ద్వితీ. 34)

### యిశ్రాయేలీయులు కనాను దేశమును స్వాధీనపరుచుకొనుట.

1. యొర్దాను నదిని దాటుట.

1. యెహోవ యెహోషువతో నిట్లనెను: నేను మోషేకు తోడయియుం

డినట్లు నీకును తోడయి యుండెదను. ప్రజల కన్నుల యెదుట నిన్ను గొప్పజేయ మొదలుబెట్టెదను. నీవు బ్రతుకుదినము లన్నిటను ఏమనుష్యుడును నీయెదుట నిలువలేక యుండును. నిన్ను విడవను, నిన్ను ఎడబాయను, నిబ్బరము కలిగి ధైర్యముగానుండుము. మీరు అడుగుపెట్టు ప్రతిస్థలము మీకు ఇచ్చియున్నాను. మీరు యొర్దాను నీళ్లదరికి వచ్చి యొర్దానులో నిలువుడని నిబంధన మందసమును మోయు యాజకుల కాజ్ఞనిమ్ము.

(2) యొర్దాను నదిని దాటుటకై జనులు తమ గుడారములలోనుండి సాగినప్పుడు నిబంధనపెట్టె మోయు యాజకులు వారికి ముందుగా వెళ్లిరి. యొర్దాను దానిగట్లన్నిటిమీద పొర్లి పారెను. యాజకులు నదిలోనికి దిగుచుండగా వారికాళ్లు నీటియంచున మునగగానే పైనుండి పారునీళ్లు బొత్తిగా నాపబడి ఏక రాశిగా నిలిచెను. అప్పుడు జనులందరు యారిన నేలమీద నదిని దాటుచు వచ్చిరి.

( యెహోషువ 1, 3 )

పిమ్మట దేవుడు మన్నాను కురిపించుట మానెను.

## 2. యెరికో పట్టణమును లోపరచుకొనుట.

(1) యెహోషువ యెరికో ప్రాంత్యమున నున్నప్పుడు దూసిన కత్తి చేత పట్టుకొని తన యెదుట నిలిచియుండిన నొకని చూచెను. యెహోషువ తన కగుపడియున్న యామనుష్యునితో నీవు మాపక్షముగా నున్నవాడవా? మావిరోధుల పక్షముగా నున్నవాడవా? యనిపలుకగా అందు కాతడు, నేను యెవనిపక్షముగా నున్నవాడనుకాను; యెహోవా సేనాధిపతినిగా నేను వచ్చియున్నాను. నీవు నిలచియున్న యీస్థలము పరిశుద్ధమయినది నీపాదరక్షలు తీసివేయుమని

చెప్పెను. ఆకాలమున యిశ్రాయేలీయుల భయముచే యెవడును వెలుపలికి పోకుండను లోపలికి రాకుండను యెరికో పట్టణపు ద్వారము గట్టిగా మూసివేయబడెను. అప్పుడు యెహోవ యెహోషు వతో నిట్లనెను: నేను యెరికోను దానిరాజును పరాక్రమముగల శూరులను నీచేతి కప్పగించి యున్నాను. మీరందరు యుద్ధసన్నద్ధులై పట్టణమును ముట్టడించి దినమునకొకమారు దానిచుట్టు తిరుగ వలెను. అలాగు ఆరు దినములు చేయుచు రావలెను. ఏడుగురు యాజకులు బూరలను బట్టుకొని ముందు నడువవలెను. ఏడవ దినమున మీరు ఏడుమారులు పట్టణముచుట్టు తిరుగుచుండగా ఆయాజకులు బూరల నూదవలెను. మానక యోబేలు కొమ్ములతో వారు ధ్వని చేయుచుండగా మీరు బూరలధ్వని వినునప్పుడు జనులందరు ఆర్భాటముగా కేకలు వేయవలెను. అప్పుడు యా పట్టణము యొక్క ప్రాకారములు కూలును. ఆరు దినములు వారు అలాగు చేయుచువచ్చిరి. ఏడవ దినమున వారు ఉదయమున చీకటితోనే లేచి ఏడుమారులు పట్టణముచుట్టు తిరిగిరి. ఏడవమారు యాజకులు బూరల నూదినప్పుడు ప్రజలు కేకలువేయుచుండగా పట్టణము యొక్క ప్రాకారములు కూలెను. అప్పుడు యిశ్రాయేలీయులు పట్టణములో ప్రవేశించి దాని స్వాధీనపరచుకొనిరి.

( యెహోషు 6. )

3. కనానీయుల వంశములు:—

యెబూసీయులు, అమోరీయులు, గిర్గాషీయులు, హివ్వీయులు, అర్కీయులు, సినీయులు, అర్వాదీయులు, సమారీయులు, హమాతీయులు.

( ఆదికాం. 10, 15-17 )

ఈవంశములకును యిశ్రాయేలీయులకును తరచుగా యుద్ధ

ములు జరుగుచుండెను.

యెహోవ ఆజ్ఞప్రకారముగా ( ద్వితీ. 7: 2. ) యిశ్రాయేలీయులు వారిని లోపరచుకొని హతముచేసి ఏడుసంవత్సరములలోగ దేశమంత పట్టుకొనిరి.

## 4. దేశమును పంచి పెట్టుట.

తరువాత యెహోషువ యిశ్రాయేలీయుల పన్నెండుగోత్రములవారికి దేశమును పంచిపెట్టెను. దేవుడు సెలవిచ్చిన ప్రకారము లేవీగోత్రమునకు భూమి నివ్వక 48 పట్టణములను వారికి స్వాస్థ్యముగానుండునట్లు నియమించెను.

## 5. యెహోషువ మృతిబొందుట.

యెహోషువ వృద్ధుడయినప్పు డతడు యిశ్రాయేలీయుల గోత్రముల వారందరిని షెకెములో పోగుచేసివారితో నిట ్లనెను: ‹‹మీారు ఎవని సేవింప కోరుకొనుచున్నారో యీాదినమున యేర్పరుచుకొనుడి. నేనును నాయింటివారును యెహోవాను సేవించెదము,, అందుకు ప్రజలు మేము యెహోవను సేవించెదమని జెప్పిరి. యెహోషువ నూటపదియేండ్ల వయస్సుగలవాడయినప్పుడు మృతినొందెను. (యెహోషువ గ్రంథము)

---

# అయిదవ ప్రకరణము: న్యాయాధిపతులు దేశమును పాలించుట.

మొత్తముమీద 450 సంవత్సరములు.

## I

## ఇశ్రాయేలీయులు లొంగిపోవుటయు శిక్షనొందుటయు.

1. యెహోషువ చనిపోయినవెనుక యిశ్రాయేలీయులు యెహోవాను విసర్జించి బయలును అష్టారోతును అనే అన్యదేవతలను పూజించిరి. గనుక దోచుకొనువారి చేతికి దేవుడు వారిని అప్పగించెను. వారు తమ శత్రువులయెదుట నిలువలేకపోయినవారయిరి. వారికి బాధ కలుగచేయుటకు యెహోవా వారికి శత్రువాయెను. గనుక వారికి మిక్కుటమయిన యిబ్బంది కలిగెను.

(న్యాయాధిప 2.)

## II

## యెహోవా న్యాయాధిపతులను పుట్టించుట.

ఆకాలమున యెహోవా న్యాయాధిపతులను పుట్టించెను. వీరు

దోచుకొనువారి చేతిలోనుండి యిశ్రాయేలీయులను రక్షించిరి. అయితే వారు యింక న్యాయాధిపతులమాట వినక దేవుని ఆజ్ఞల ననుసరించి నడచిన మార్గమునుండి త్వరగా తొలగిపోయి ఇతర దేవతలతో వ్యభిచరించి వాటికి నమస్కరించిరి.

ఒక్కొక్క న్యాయాధిపతి చనిపోగా వారువెనుకకు తిరిగి యితర దేవతలను పూజించిరి. గనుక దేవుడు యెహోషువ చనిపోయిన కాలమున శేషించిన జనములలో యేజనమును వారియెదుట నుండి నేను వెళ్ళగొట్టను. ఆజనములవలన ఇశ్రాయేలీయులను శోధించుటకై వారినుండనిచ్చెదననెను. న్యాయా 3:

# III
# తరుచుగా పాలించిన న్యాయాధిపతులు.

1. ఒత్నీయేలు—నలుబది సంవత్సరములు పాలించెను. (న్యాయా 3:9)
2. యేహూదు—80 సం॥. పాలించెను.

న్యాయా 3 20, 30 సమరు.

| | | | |
|---|---|---|---|
| 3, 4 | దెబోరయు, బారాకును—40 సం॥ | న్యాయా. | 4: 4, 5. |
| 5. | గిదోను—40 సం॥ | ,, | 8: 28. |
| 6. | అబీమెలెకు (రాజు)—3 సం॥ | ,, | 9: 6. |
| 7. | తోలా—23 సం॥ | ,, | 10. 2. |
| 8. | యాయీరు—22 సం॥ | ,, | 10. 3. |
| 9. | యెప్తా—6 సం॥ | ,, | 12. 7. |
| 10. | ఇబ్సాను 7 సం॥ | ,, | 12. 9. |

| | | | |
|---|---|---|---|
| 11. | యాలోను 10 సం॥ | ,, | 12. 11. |
| 12. | అబ్దోను 8 సం॥ | ,, | 12. 13. |
| 13. | సిమ్షోను 20 సం॥ | ,, | 15. |
| 14. | సమూయేలు 40 సం॥ | 1 సమూ 7. 15. | |

ప్రధానయాజకుడయిన ఏలీయనువాడు యిశ్రాయేలీయులను పాలించిన కాలము 40 సంవత్సరములు.

(1 సమూ. 4. 18.)

# IV
## గిదోను.

1. యిశ్రాయేలీయులు యెహోవ దృష్టికి దోషులయినందున ఆయన యేడేండ్లు వారిని మిద్యానీయుల కప్పగించెను. మిద్యానీయులు వారిని కఠినముగా హింసించినందున వారు కొండలనున్న వాగులను గుహలను దుర్గములను తమకు సిద్ధపరుచుకొని వానిలో దాగిరి. యిశ్రాయేలీయులు విత్తనములు విత్తిన తరువాత మిద్యానీయులును అమాలేకీయులును తూర్పున నుండువారును తమపశువులను గుడారములను తీసికొని మిడతల దండంత విస్తారముగా వారిమీదికివచ్చి భూమిపంట పాడుచేసి గొర్రెనుగాని యెద్దుగాని గాడిదనుగాని జీవనాధారమయిన మరి దేనినిగాని యిశ్రాయేలీయులకు నుండనీయక పోయిరి. యిశ్రాయేలీయులు తమశత్రువులవలన అలాగు మిక్కిలి హీనదశకువచ్చినప్పుడు వారు యెహోవకు మొర్రబెట్టుకొనిరి.

2. గిదోను వొకవాడు గోధుమలను దుళ్ళగొట్టుచుండగా యెహోవ దూత యతని కగుపడి అతనితో—పరాక్రమముగల బలాఢ్యుడా, యెహోవ నీకు తోడయి యున్నాడు. మిద్యానీయుల చేతిలోనుండి

యిశ్రాయేలీయులను రక్షింపుము. నిన్ను పంపుచున్నవాడను నేనే యనెను. అప్పుడు గిదోను నొక అర్పితము తీసికొనివచ్చి, యాదూత దగ్గర నుంచగా దూత యా అర్పితము ముట్టెను. అప్పుడు నేల లోనుండి యగ్ని వెడలి యాఅర్పణమును కాల్చివేసెను.

3. అప్పుడు గిదోను తన తండ్రికట్టిన బయలుయొక్క బలిపీఠమును పగులగొట్టి దానికి పైగానున్న దేవతాస్తంభమును నరికివేసెను. ఆ గ్రామస్థులు బయలుయొక్క బలిపీఠము విరగగొట్టబడియుండుట చూచినప్పుడు వారు కోపగించి, ఈద్రోహము చేసినవాడు చావవలెననిరి.

అప్పుడు గిదోను తండ్రి యిట్లనెను: మీరు బయలుపక్షముగా వాదింతురా? మీరువాని రక్షించుదురా? ఎవడో దాని బలిపీఠమును విరగగొట్టెను. అది దేవతగనుక తనపక్షమున తానే కలహింపవచ్చును.

4. మిద్యానీయులు అమాలేకీయులు తూర్పువారునుకూడివచ్చి ఇశ్రాయేలు మైదానములో దిగిరి. అప్పుడు యెహోవా ఆత్మ గిదోనును ఆవేశించెను. మరియు గిదోను దేవునితో నిట్లనెను: నీవు సెలవిచ్చునట్లు నాచేత యిశ్రాయేలీయులను నీవు రక్షింపనుద్దేశించినయెడల నేను కళ్ళమున గొర్రెబొచ్చునుంచిన తరువాత నేలంతయు ఆరియుండగా నాగొర్రెబొచ్చుమీద మాత్రమే మంచుపడు పక్షమందు నీవు సెలవిచ్చినట్లు యిశ్రాయేలీయులను నామూలముగా రక్షించెదవని నేను నిశ్చయించుకొందుననెను అలాగున జరిగెను. అతడు ప్రొద్దున లేచి ఆ బొచ్చును పిడచి నీళ్ళతో పాత్ర నిండువరకు యాబొచ్చునుండి మంచును పిండెను. అప్పుడు గిదోను దేవునితో నీకోపము నామీద మండనీయకుము. యింకొక మారే ఆబొచ్చు

చే శోధింప సెలవిమ్ము నేలంతటిమీద మంచుపడియుండగా యీ బొచ్చుమాత్రమే పొడిగానుండనిమ్మని యనగా యారాత్రి దేవుడు అలాగున చేసెను.

5. అప్పుడు గిదోను తన సన్నద్ధులను పిలిపించి మిద్యానీయులమీదికి పోయెను. యెహోవ గిదోనుతో సెలవిచ్చినదేమనగా: నీతోనున్న జనులు ఎక్కువమంది, నేను మీ చేతిం మిద్యానీయులను అప్పగింప తగదుయెందుకనగాయిశ్రాయేలీయులు — మా బాహుబలముచేత మేము రక్షణకలుగచేసికొంటిమిగదాయని నామీదయతిశయించుదురేమో కాబట్టియెవడుభయపడుచున్నాడో వాడుజనులలోనుండితిరిగి వెళ్ళవలెనని నీవు వారితో చెప్పుమనెనుగిదోనుఅట్లుచేసినప్పుడు 22000 మంది తిరిగి వెళ్ళిరి.

10000 మంది నిలిచియుండగా యెహోవ గిదోనుతో ఈజనులింక యెక్కువమంది; నీళ్ళయొద్దకు వారిని దిగజేయుము. అక్కడ నీకొరకు వారినిశోధించెదననెను. అతడునీళ్ళయొద్దకుయీజనమునుదిగ చేసినప్పుడు యెహోవ, కుక్క గతుకునట్లు తన నాలుకతో నీళ్ళను గతికిన ప్రతివానిని, త్రాగుటకు మోకాళ్లూని క్రుంగిన ప్రతివానిని వేరువేరుగా నుంచుమని గిదోనుతో సెలవిచ్చెను. చేతితో నోటికందించుకొని గతికిన వారిలెక్కమున్నూరుమంది. అప్పుడు యెహోవ గిదోనుతో ఈమున్నూరుగురు మనుష్యులద్వార మిమ్మును రక్షించెదననెను.

మరియు గిదోను ఆమున్నూరుమందిని మూడుగుంపులుగాజేసి ప్రతివానికినొకబూరనున్ను నట్టికుండనున్ను యీకుండలలో దివిటీలనున్ను యిచ్చి వారితో మనము యీదండు పాలెమునకు పోయే

టప్పుడు మీరందరు నావంక చూచి నేను చేయునట్లు మీరందరు చే
యవలెనని చెప్పెను. రాత్రివేళ వారు లేచి మిద్యానీయుల దండు
పాలెము సమీపించినప్పుడు గిదోనుతోనున్న యామున్నూరుగురు
తమ దివిటీలను చేత పట్టుకొని అల్లాడించుచు ఏకముగా తమ కుండ
లను పగలగొట్టుచు, బూరగల నూదుచు, యెహోవ కొరకును గిదో
ను కొరకును యని ఏకగ్రీవముగా కేకలు వేసినప్పుడు శత్రువులు జడి
సి పరుగెత్తుచు, కేకలు వేయుచు, పారిపోయిరి.

(న్యాయాధి. 6—7)

# V

# సమూయేలు

1. ఏలీ న్యాయాధిపతియును యాజకుడును అయియున్న కాలమున రా
మాయనే పట్టణమందు ఎల్కానా యనే పేరుగల నొకడు నివసిం
చెను. అతనికి యిద్దరు భార్యలుండిరి. వీరిలో నొకదాని పేరు హ
న్నా ఆమె గొడ్రాలయినందున యామెకు పిల్లలు లేకపోయిరి.
కాబట్టి హన్నా దుఃఖాక్రాంతురాలయి బహుగా యేడ్చి దేవుని
వేడుకొని చెప్పినదేమనగా:—దేవా, నీవు మగపిల్లను నాకు దయ
చేసినయెడల వాడు బ్రతుకుదినములన్నిటను నేనతని నీకప్పగించెద
ను. ఒకకుమారుడామెకు కలిగినప్పుడు హన్నా సమూయేలుయని
పేరతనికి పెట్టి దేవునికి వానిని ప్రతిష్ఠించెను. ఆపడుచు
వాడై దిగినప్పు డతడు ఏలీయెదుట మందిరములో యెహోవకు ప
రిచర్య చేయుచు భయభక్తితో వర్ధిల్లుచు నుండెను.

మరియు యేలీయొక్క కుమారులు యెహోవ నెరుగక మి
క్కిలి దుర్మార్గులయి యుండిరి.

2. బాలుడైన సమూయేలు ఏలీయెదుట మందిరములో పరిచర్య చేయు చుండగా నొకనాటి రాత్రి అతడు పండుకొనినతరువాత యెహోవ యాతని పిలిచెను. ఏలీయే తన్ను పిలిచెనని సమూయేలుతలచి-చిత్తమయ్యా యున్నానని పలికి లేచి ఏలీయొద్దకుజని నీవు నన్ను పిలిచితివిగదాయని యతనితో జెప్పెను. అందు కతడు నేను నిన్ను పిలువలేదు; పోయి పండుకొమ్మని చెప్పగా సమూయేలువెళ్ళి పండుకొనెను. యెహోవ మరల సమూయేలును పిలువగా అతడు లేచి ఏలీయొద్దకు పోయి నన్ను పిలిచితివి గనుక వచ్చితిననెను. అప్పుడతడు నాకుమారుడా, నేను నిన్ను పిలువలేదు; వెళ్లి పండుకొమ్మని పలికెను. అప్పటికి సమూయేలు యెహోవస్వరము నెరుగకుండెను.

మూడవమారు యెహోవ సమూయేలును పిలువగా ఆయనలేచి ఏలీచెంతకు పోయి అయ్యా నన్ను పిలిచితివేలననగా, యెహోవ యాబాలుని పిలిచెనని ఏలీ అనుకొని నీవు వెళ్ళి పండుకొమ్ము,యెవరయిన నిన్ను మరల పిలిచినపక్షమున, దేవా, నీదాసుడాలకించుచున్నాడు. యాజ్ఞనిమ్మని చెప్పుమని అతడు సమూయేలుతో నన్నప్పుడు సమూయేలుపోయి తన స్థలమందు పండుకొనెను. మరల దేవుడు సమూయేలుకు ప్రత్యక్షమయి తన కుమారులు తమ్మును తాము శాపగ్రస్తులుగా చేసికొనుచున్నారని ఏలీ తానెరిగినను ఆయన వారిని నడ్డగింపక యుండుటవలన వానియింటిమీద శిక్ష విధింపబోవుచున్నానని చెప్పెను.

3. తరువాత నత్యాధికమైన వధ యొకటిజరిగినప్పుడు తనయొక్క ఇద్దరు కుమారులు హతులయిరనియు నిబంధనపెట్టె శత్రువులచే పట్టబడెననియు యీ సమాచారము ఏలీ వినినప్పు డాయన తన పీఠమునుండి వెనుకకుపడి, మెడవిరిగి చనిపోయెను.

# ఆరవ ప్రకరణము.

# రాజులు ప్రభుత్వము చేయుట.

సౌలు రాజుగా నభిషేకింపబడుటనుండి(క్రీ. ము, 1095)యూదులు చెరలోనికి వెళ్ళువరకు (క్రీ. ము. 587) — 508. సంవత్సరములాయెను.

## I

## మొదటి ముగ్గురు రాజులు.

### 1. సౌలుయనురాజు—నలుబది సంవత్సరము లేలుట—1095 1055 క్రీ. ము.

1. సమూయేలు వృద్ధుడయినప్పుడతడు యిశ్రాయేలీయులమీద తనకుమారులను న్యాయాధిపతులుగా నియమించెను. వీరు తమ తండ్రిప్రవర్తనను యనుసరింపక ధనాపేక్షులయి లంచములు పుచ్చుకొని న్యాయమును త్రిప్పివేసిరి. అట్లుండగా యిశ్రాయేలీయుల పెద్దలందరు కూడి సమూయేలునొద్దకు వచ్చి చిత్తగించండి, నీకుమారులు నీప్రవర్తనవంటి ప్రవర్తనగలవారు కారుగనుక యాతడు మాకు న్యాయము తీర్చునట్లును మాయుద్ధములను జరిగించునట్లును సకలజనముల మర్యాదచొప్పున మాకొకరాజు నేర్పరచవలె ననిరి. ఆమాటలు సమూయేలు దృష్టికి ప్రతికూలముగా నుండెను. కాబట్టి యతడా సంగతిని గురించి యెహోవాను ప్రార్థనచేసెను. అప్పుడుయె

హోవ సమూయేలుతో నిట్లనెను. జనులు నీతో చెప్పిన ప్రకారము
గా జరిగించుము. వారు నిన్ను విసర్జించలేదుగాని నెమ్ము నేలకుం
డ నన్నే తృణీకరించి యున్నారు.

2. కీషుయను బెన్యామీనీయు డొకడుండెను. సౌలను పేరుగల కు
మారుడొక డతనికుండెను. అయాననుడు బహుసుందరుడును యా
జానుబాహువునయి భుజములు మొదలుకొని పయికి యితరులకంటె
ఎత్తుగలవాడు యుండెను.' ఒకనాడు సౌలు ప్రవక్తయయిన సమూ
యేలు దగ్గరకు రాగా యతని రాజుగా నభిషేకింపుమని యెహో
వ సమూయేలు కాజ్ఞయిచ్చెను. అతడట్లు జేసెను. యా దినమున
దేవుడు సౌలుకు క్రొత్తమనస్సు ననుగ్రహించెను. అప్పటినుండి
యెహోవయాత్మ సౌలుమీదికి బలముగా వచ్చెను. మరియు సౌ
లు ప్రవక్తలలో నొకడుగా నెంచబడెను.

తరువాత సమూయేలు ప్రజలను మిస్పెయనే చోటుకు పిలువ
నంపించి నప్పు డచ్చట గోత్రములలో చీట్లువేయగా బెన్యామీ
ను గోత్రముయొక్క పేరున చీటివచ్చెను. ఆగోత్రమువారిలో మ
రల చీట్లువేయుచుండగా సౌలు పేరట వచ్చెనుగనుక అతడు రాజు
గా నేర్పర్చబడెను.అప్పుడు ప్రజలందరు బొబ్బలు పెట్టుచు రాజుచి
రంజీవి యగుగాకయని కేకలు వేసిరి.

మరియు సౌలు యిశ్రాయేలీయులను పాలించుచు జయకరము
గా ననేకవధలు జరిగించెను.

3. అమాలేకీయుల నేవారికిని యిశ్రాయేలీయులకును యుద్ధము జరుగు
చువచ్చిన సమయమున యెహోవ శత్రువులను సౌలుకు జిక్కనిచ్చి
వారిదుర్మార్గతనుబట్టి వారినిన్ని వారి పశువుల మందలనున్న హత
ము చేయవలయునని నతనికాజ్ఞనివ్వగా నతడట్లు చేయక యుండెను
అప్పుడు సమూయేలు యతని అవిధేయతనుబట్టి నతని గద్దింపవచ్చి

యనిన దేమనగా అమాలేకీయులను వారి యావదాస్తినిన్ని నాశనము చేయుటకు దేవుడు సెలవిచ్చిన ఆజ్ఞను నిరాకరించి కొన్ని పశువులను మిగిలించితివేమి, అందుకు సౌలు యెహోవ కర్పణము చెల్లించుటకు వాటిని ప్రాణముతో యుంచితిననెను. అందుకు సమూయేలు బలుల నర్పించుటకంటే యాజ్ఞను గయికొనుట శ్రేష్ఠము. యెహోవయాజ్ఞను విసర్జించితివి గనుక నీవు రాజుగా నుండకుండ యాయన నిన్ను విసర్జించెను.

4. సౌలునుగురించి సమూయేలు బహుగా దుఃఖించెను. అప్పుడు యెహోవయతనితో సౌలునుగురించి నీ వెంతకాలము దుఃఖింతువు.
బెత్లెహేమీయుడైన యిషయియొద్దకు వెళ్ళి యతని కుమారులలో నొకని రాజుగా నభిషేకింపుమని యన్నందున సమూయేలు లేచి యిషయి యింటికివెళ్ళి అతనికుమారులలో దావీదుయను చిన్నవాని నభిషేకించెను. అప్పుడు యెహోవయాత్మ బలముగా దావీదుమీదికి నచ్చెను. దయ్యమొకటి సౌలును పట్టెను.

1 సమూయేలు 16.

2.

# దావీదున్ను గొల్యాతున్ను.

1. పెలిష్తీయులు తమసైన్యములను యుద్ధమునకు సమకూర్చుచుండగా సౌలును యిశ్రాయేలీయులును వారికెదురుగ యుద్ధపంక్తులు దీర్చిరి. అప్పుడు గొల్యాతుయను శూరుడొకడు పెలిష్తీయుల దండులోనుండి బయలుదేరుచు యిశ్రాయేలీయుల దండును బిలుచుచు యుద్ధపంక్తులు తీర్చుటకై మీరెందుకువచ్చితిరి. మీపక్షమున నొకని నియమించుకొని యతనినాయొద్దకు పంపుడి. అతడు నాతోపోట్లాడి నన్ను చంపగలిగిన యెడల మేము మీకుదాసులముగు

దుము. నేనతనిజయించి చంపినయెడల మీరు మాకు దాసులవు
దురు. యీదినమున నేను యిశ్రాయేలీయుల సైన్యములను దృణీ
కరించుచున్నానసెను. అతడు నలుబదిరోజులుతిన్ను తానగుప
రుచుకొనుచు యిశ్రాయేలీయులను తిరస్కరించుచు వచ్చెను. ఆ
శూరుడు యారుమూళ్ళజేసెడు ఎత్తుమనిషియయి తలమీద రాగి
శిరస్త్రాణమును కాళ్ళకు రాగికవచమును భుజములమధ్య రాగి బల్లె
మొకటిని ధరించుకొనుచు ఈటె చేతపట్టుకొనుచునవచ్చెను. యిశ్రా
యేలీయులందరు నతనినిబట్టి వెరగుపడి బహుభీతులయిరి.

2. దావీదు తనతండ్రి మందలను గాచుచుండెను. అతనిసహోదరు
లు సౌలుతోటి యుద్ధరంగములోనుండిరి. వారిక్షేమము తెలుసు
కొనునిమిత్తము తండ్రియతనిబంపెను. దావీదుబయలుదేరి యుద్ధ
సన్నిధులను సమీపించినప్పుడు గొల్యాతువచ్చి యిశ్రాయేలీయు
లను దూషించెను. దావీదు యతనిమాటలువినియేటిలోయలోనుం
డి యయిదు నున్నని రాళ్ళను ఏరుకొని తనయొద్దనున్న చిక్కము
లో వానినుంచుకొని వడిసెలను గర్రనుజేత బట్టుకొని యాపెలిస్తీ
యుని చేరునకు బోయెను. గొల్యాతుబయిలుదేరి దావీదు నెదురు
కొనవచ్చి, చుట్టు పారచూచి దావీదునుగని నతడు బాలుడయి
యుండుటచూచినందున నతనిత్రృణీకరించి, కర్రనుతీసుకొని నీవు
నామీదికివచ్చుచున్నావే? నేనుకుక్కనాయని దావీదుతో చెప్పి తి
నదేవతల పేరట దావీదును శపించి నాదగ్గరకురమ్ము. నీమాంసము
నాకాశపక్షుల కిచ్చివేతుననగా దావీదు నీవుకత్తియు, నీ యీటెయు,
బల్లెమును ధరించుకొని నామీదికి వచ్చుచున్నావు. అయితే నీవు
తిరస్కరించిన యిశ్రాయేలీయుల సైన్యములధిపతియగు యెహో
వ పేరట నేనునీమీదికి వచ్చుచున్నానని చెప్పి తన సంచిలోనుండి
నొకరాయిదీసి వడిశెలతో విసరి యాశూరుని నుదుటికిబెట్టెను.

ఆరాయి వానినుదుట చొచ్చినందున వాడు నేలను బోర్లబడెను. వాడుబోర్లపడగా దావీదు పరుగెత్తిపోయి వానిచంపి తలనుతెగ వేసెను. జరిగినసంగతిని చూచినప్పుడు ఫిలిస్తీయులు జడిసి పారిపోయిరి.

3.

# సౌలు దావీదుమీద పగబట్టుట.

1. యిశ్రాయేలీయులు యుద్ధమునుండి తిరిగి వచ్చినప్పుడు స్త్రీలు తంబురలతోను, సంభ్రమముతోను, వాయిద్యములతో, నాడుచు బాడుచు రాజైన సౌలును ఎదుర్కొనుటకై వచ్చి, గానప్రతిగానములు జేయుచు వాయించుచు సౌలు వేలకొలదియు దావీదు పదివేలకొలదియు శత్రువులను హతము జేసెననిరి. కాబట్టి యీమాటలు సౌలుకు నింపుగానుండనందున నతడు బహుకోపము తెచ్చుకొని దావీదుకు స్తుతులు పాడిరే రాజ్యముతప్ప మరియేమితక్కువని అనుకొని దావీదుమీద విషపుచూపు నిలిపి ననేకపర్యాయములు నతని చంపజూనుకొనెను. గాని దావీదు కీడుకు మేలు ప్రత్యుపకారముగా జేసెను-

2. తరువాత పెలిస్తీయులుయిశ్రాయేలీయులతో యుద్ధముజేయగా పెలిస్తీయులు వారిని హతముచేసిరి. ఒకనాడు సౌలుయొక్క ముగ్గురుకుమారులు కూలిరి. ఆనాడు సౌలు ఓడిపోవుచుండగా విలుకాండ్లు గురిపెట్టి నతనికొట్టినందున బహుగా భయపడి—ఈసున్నతి లేనివారు వచ్చినన్నుపొడచి నపహాస్యము జేయకుండునట్లు నీకత్తి దూసి నన్నుపొడువుమనితన ఆయుధములనుమోయువానితో చెప్పగానతడు భయముచే నాలాగు చేయనొల్లకుండెను గనుక సౌలు తనకత్తి

పట్టుకొని దానిమీదపడి ప్రాణమువిడిచెను సౌలున్ను యతనికుమా రులున్ను యుద్ధరంగములో కూలిరన్న సంగతి దావీదువినినప్పుడతడువ స్త్రములను చించుకొని బహుగా దుఃఖించి యేడ్చి యుపవాసము చేయుచుండెను.

1 సమూ. 18—24, 26, 27, 31. 2 సమూ. 1.—

4.

దావీదు రాజుగా నిర్ణయింపబడుట—ఆయన రాజ్యభార ము వహించినకాలము 40 సంవత్సరములు(క్రీ. పూ—1055—1015)

1. సౌలుయనేరాజు చనిపోయిన పిమ్మట దావీదు యెహోవ సెలవు ప్రకారము హెబ్రోను యను పట్టణములోనికివెళ్ళి కాపురముచే యుచుండెను. ఏడు సంవత్సరములు యూదాగోత్రపు వారిని రా జుగా పరిపాలించెను.

2. సౌలుయొక్క సైన్యాధిపతియగు అబ్నేరుతక్కినగోత్రములవారి నే లుటకై యిష్బోషెతు యను సౌలుయొక్క పుత్రుని నిర్ణయించె ను. అతడు గిలియాదు యను పట్టణములో రెండేండ్లేలిన పిమ్మట చ నిపోయినప్పుడు దావీదు యిశ్రాయేలీయుల పండ్రెండు గోత్రము లవలన రాజుగా నేర్పరచబడి ముప్పదిమూడేండ్లు ప్రభుత్వముజే సెను.

3. ఆకాలమందు యెబూసీయులనేవారుయెరూషలేములో నివాసుల యి యుండిరి. దావీదు యాపట్టణమును లోపరచుకొని,సీయోనన బడిన దానికోటను స్వాధీనపరచుకొని దానికి దావీదు పురమని పే రు బెట్టెను.

4. ఏలీకాలమందు ఫిలిస్తీయులువచ్చి నిబంధనపెట్టెను దోచుకొని వె

ళ్ళిరి. అందుచేతవబాధకరమైనశిక్షకై దేవుడు వారిని శిక్షించినప్పు
డు వారు నిబంధనపెట్టెను తీసికొనివచ్చి యిశ్రాయేలీయులకుమ
రలనప్పగించిరి. ఆకాలము మొదలుకొని డెబ్బదెసంవత్సరములవరకు
లేవీయుడయిన అబీనాదాబు యింటిలో అది యుంచబడెను. దావీ
దురాజైనప్పుడాయన ఒక గుడారము చేయించి అబీనాదాబుయిం
టనుండి నిబంధన పెట్టెను తెప్పించి పాటకులనున్ను లేవీయులనున్ను
నిర్ణయించి యారాధన క్రమమేర్పరుచుకొని స్థాపించెను.
మరియు దావీదు ననేక కీర్తనలు రచియించి వాటిలో గొన్నిటిమూ
లముగా రాబోవు లోకరక్షకుని రాకడనుగురించి ముందుచెప్పుచువ
చ్చెను.

5. యెహోవా దావీదును అత్యధికముగా దీవించి లోకములోని ఘను
లకు కలిగియున్న పేరువంటి పేరతనికి కలుగజేసెను. దేవునికొరకై
యాలయము కట్టింప నుద్దేశించినప్పుడు నాతానను ప్రవక్తమూ
లముగా యెహోవా యతనికి సమాచారముపంపించి సెలవిచ్చినదే
మనగా: నీజీవితకాలముతీర నీపితరులయొద్దకు నీవు జేరినతరువాత నీ
పుత్రుడు నాకొరకొక మందిరము కట్టించును.

6. దావీదు నీతితోవను తప్పి యన్యస్త్రీలను గొందరిని పెండ్లాడి ఘోర
మైన పాపములో పడినందున యతనికి బుద్ధిచెప్పించు నిమిత్తమై దే
వుడు ప్రవక్తయైన నాతానునే అతనిచెంతకు పంపెను. అప్పుడు
దావీదు తనపాపముల నొప్పుకొని దేవునికి ప్రార్థన చేసినదేమనగా
దేవా నీకృపచొప్పున నన్నుకరుణించుము నీవాత్సల్య బాహుళ్య
ముచొప్పున నాయతిక్రమములను తుడిచివేయుము. నాపాపము
పోవునట్లునన్ను బాగుగా కడుగుము దేవా, నాయందు శుద్ధహృదయ

నుంచుము.

7. దేవునిమందిరము గట్టుటకై జనులు మనఃపూర్వకముగా. దావీదుకు బంగారపుపనికి బంగారమును వెండిపనికి వెండినియిత్తడిపనికి నిత్త డిని ఇనుపపనికి నినుమును కఱ్ఱపనికి కఱ్ఱలను, దానికగత్యమైన స మస్త వస్తువులనిచ్చిరి.

మందిరమునిమిత్తము దావీదుకు కలిగిన మిక్కుటమైనచేత యావత్తు తనస్వంత బంగారమును వెండిని ఇచ్చెను. తాను వృద్ధుడయినప్పుడు తనకుమారుడగు సొలొమోనుకు ప్రభుత్వమప్పగించి దేవాలయముకట్టబడవలసినమాది రినికి వివరించి చూపెను. మరియు దావీదు ఐశ్వర్యప్రభావ ములు గలిగి మంచిముదిమిలో మరణమొందెను.

2 సమూ. 2—8, 10. 1దినవృత్తాం. 23, 25, 28, 29. కీర్త 51

5.

## రాజైన సొలొమోను.

నలుబది సంవత్సరములు పరిపాలించుట. క్రీ.ము. 1015—975.

1. ఒకనాటిరాత్రి యెహోవా సొలొమోనుకు ప్రత్యక్షమై— నేను నీకు దేని యిచ్చుట నీకిష్టమో దాని నడుగుమని సెలవియ్యగా సొ లొమోను తాను ప్రజలను న్యాయముతో యేలగలుగునట్లును దేవు నికి లోబడియుండగలుగునట్లును కార్యములను జరుపుటకై జ్ఞాన వివేకములుగల హృదయము దేవు డతని కిచ్చునట్లు ప్రార్థన చేసెను. సొలొమోను జేసిన ఈప్రార్థన ప్రభువున కనుకూలమాయెను. గను

క దేవుడు యతని బహుగా దీవించెను గాన సొలొమోను మహా ఘనుడయి ప్రసిద్ధికెక్కెను. అతని జ్ఞానవాక్యములను వినుటకై భూపతులు యతని దర్శింపగోరిరి.

2. సొలొమోను యిశ్రాయేలీయుల నేలిన నాలుగవ సంవత్సరమాయన యెరూషలేములో మోరియా యను పర్వతముమీద మందిరమును గట్టింప నారంభించెను. ఏడు సంవత్సరములు దాని గట్టించెను. ఆమందిరము కట్టించుటకు పట్టిన సయికము పదుహేను వందల యేబదినాలుగుకోట్ల ఏబదినాలుగులక్షల యాబదినాలుగువేల యేడు వందల నలుబదియేడు రూపాయలు.

3. సొలొమోను మందిరమునకు చేసిన పనియంతయు సమాప్తియైన పిమ్మట లెక్కింప శక్యముకాని గొర్రెలను, యెద్దులను, బలిగానర్పించి దాని యెహోవకు ప్రతిష్ఠించెను. అప్పుడు యెహోవ మహిమచేమందిరము నింపబడెను. ఆతేజస్సుచేతయాజకులు సేవ చేయుటకు నిలువలేకపోయిరి.

4. సొలొమోను వృద్ధుడయినప్పుడు దేవుని మార్గమునుండి తొలగిపోయి పరస్త్రీలను మోహించి కామాతురత గలవాడయి వారిని యుంచుకొనుచువచ్చెను. వారు తమ విగ్రహములతట్టుకు నతని హృదయమును త్రిప్పగా యెహోవ నతనితో నిట్లనెను.—నేను నీతో చేసిన నిబంధన నీవు గైకొనక పోతివి గనుక నీరాజ్యము నీకుండకుండ నిశ్చయముగా తీసివేసి నీదాసుని కిచ్చెదను. అయినను నీతండ్రియగు దావీదునిమిత్తము నీదినములయందు ఆలాగున చేయక నీకుమారుని చేతిలోనుండి రాజ్యము తీసివేతును. ఆటుపిమ్మట దేవుడు సొలొమోనుకు శత్రువులను లేపెను. వారిలో యారొబా

ము అనే యతని దాసుడొకడు. సాలొమోను నతని చంపజూచెను కానందున అతడు లేచి ఐగుప్తు ప్రదేశమునకు వెళ్లెను.

1 రాజు 3—11.

# II

## రాజ్యము విభాగించబడుట.

సాలొమోను మరణమునుండి యెరూషలేమునున్న దేవాలయమును నాశనము చేయబడినదాక 387 సంవత్సరములు (క్రీ. పూ. 975—588 )

సాలొమోను చనిపోయినతరువాత యతనికుమారుడగు రెహబా మనువాడు రాజ్యాంగము చేసినవాడు. ప్రజలు అతనిదగ్గరకు వచ్చి అతనితో మనవిచేసిన దేమనగా నీతండ్రి బరువైన కాడి మా మీద నుంచెను. నీతండ్రి నియమించిన కఠినమయిన దాస్యమును నీవు చులకన చేసినయెడల మేము నీకు సేవ చేయుదుము.

అందుకాయన మీరు వెళ్లి మూడుదినములకు నాయొద్దకు తిరిగిరండని సెలవియ్యగాజనులు వెళ్లిపోయిరి. మూడవరోజున వారు రాజుకడకు తిరిగిరాగా నతడు వారితో—నాతండ్రి మీమీదబరువైన కాడి నుంచెను, సరే, నేను యీకాడిని యింకా బరువుగా చేయుదును. నాతండ్రి చబుకులతో మిమ్ము శిక్షించెను. సరే, నేను కొరడాలతో మిమ్మును శిక్షించెదననెను. ప్రజలు రాజు తమ విన్నపము వినలేదని తెలిసికొనినప్పుడు వారిలో పది గోత్రములు దావీదు సంతతిమీద తిరుగుబాటు చేసి తమకు రాజుగా

సొలొమోనుయొక్క దాసుడగు యరొబామును వాని నేర్ప
రుచుకొనిరి.

యూదా, బెన్యామీనీయుల గోత్రియులు మాత్రము రెహబా
మును వెంబడించి యతనికి లోబడిరి.

ఇశ్రాయేలీయు లట్లు వేరుపడి రెండురాజ్యములుగా నుండిరి.

A

## ఇశ్రాయేలు రాజ్యము—ఉత్తరరాజ్యము.

### 1. ప్రజలు యెహోవామీద దిరుగుబాటుచేయుట.

సొలొమోను యెరూషలేములో గట్టించిన మందిరములో ఇ
శ్రాయేలీయుల గోత్రియులు దైవారాధనము చేసిరి. అచ్చట దేవు
ని నారాధించుటకయి తన ప్రజలకు సెలవిచ్చినయెడల వారు తన
మీద తిరుగుబాటు చేసి, రెహబాము తట్టుకు దిరుగబడుదురే
మోయని యరొబాము ఆలోచనచేసి వారు యెరూషలేముకు
పోకుండునట్లు రెండు బంగారపు దూడలను చేయించి బేతేలను
చోటున నొకటిని దాను యనే స్థలమందొకటినియుంచి ప్రజల
ను బిలిచి చెప్పినదేమనగా—దేవుని నారాధించుటకయి యెరూష
లేముకు వెళ్లుట మీకు బహుకష్టము. ఐగుప్తుదేశమునుండి
మిమ్ము రప్పించిన దేవతలివే. మరియు యతడు నున్నతమయిన స్థల
ములను కట్టించి మందిరములుగా నేర్పరచి దేవతలకు యాజకులను
నియమించి ప్రజలచే విగ్రహములను పూజింపజేసెను. రాజు చేసిన
కార్యము పాపమునకు కారణమాయెను. కాబట్టి దేవుడు అతనినిన్ని

ఆతని సంతతివారినిన్ని నిర్మూలముచేసి భూమిమీద నుండకుం
డ నశింపజేసెను.

2. ఆహాబు అను రేడు.

యరొబాముకు తరువాత పరిపాలించిన వారందరు బహు
దుర్మార్గులు. అన్య దేవతలను పూజించి విగ్రహారాధనమును దిట్టము
గా జరిగించిరి. వారిలో ఆహాబుయను వాడు ఒకడు. అతడు తన
పూర్వులకంటె పాపి. అతడు యెజబెలను అన్య స్త్రీనివివా
హముచేసికొని బయలనే దేవతను పూజించుచు దానికి మందిరమునున్ను
బలిపీఠమున్ను గట్టించి యెహోవ ప్రవక్తలను జంపుచువచ్చెను.

1 రాజ. 12, 15, 16.

3. దీర్ఘదర్శియైన ఏలీయాయున్ను, బయలుయొక్క ప్రవక్తలున్ను.

(1) రాజయిన అహాబుయొక్క కాలమందు ఏలీయాయను పేరు
గల దేవుని ప్రవక్త యొకడుండెను. ఆయన అహాబుయొద్దకు వచ్చి
యిశ్రాయేలీయుల దేవుడయిన యెహోవ సన్నిధిని నేను నిలువబ
డి యున్నాను. ఆయన జీవముతోడు నామాట ప్రకారము కాక
యీసంవత్సరములలో వర్షము కురియదని చెప్పెను.

పిమ్మట యెహోవవాక్కు ప్రకారముగా ఏలీయ కెరీతు యను
ఏటిదగ్గరకుపోయి తాను దాగియుండెను. మరియు నుదయమందు
ను అస్తమయమందును కాకోలము లతనికి యాహారము తెచ్చునట్లు
దేవుడు చేసెను. అతడు యేటినీరు త్రాగెను.

(2) మూడుసంవత్సరము లయినతర్వాత యెహోవ యేలీయ
తో — నీవు వెళ్ళి అహాబును దర్శించుము. అటుపిమ్మట వర్షము కు

రించెద ననినప్పుడు ఏలీయా లేచి ఆహాబును దర్శించుటకై బయలువెళ్లెను. అప్పుడు వర్షములేక దేశములో ఘోరమైన క్షామము కలిగియుండెను. ఆహాబు ఏలీయానుచూచి యతనితో—ఇశ్రాయేలీయులకు కీడు కలుగచేయువాడవు నీవేనా? నిచ్చట నున్నావా? యని యడిగెను. అందుకు ఏలీయా—యెహోవాయొక్క ఆజ్ఞలను గైకొనక బయలు దేవత ననుసరించు నీవును నీతండ్రియింటివారును ఇశ్రాయేలీయులకు కీడు కలుగచేయువారేగాని నేనుకాను. అయితే ఇప్పుడు నీవు యిశ్రాయేలీయులందరినిన్ని బయలుయొక్క ప్రవక్తలయిన నన్నూరుమందినిన్ని కర్మెలనుపర్వతముమీదికి పిలువనంపుమని ప్రత్యుత్తరమియ్యగా ఆహాబు అట్లుచేసెను.

(౮) ఏలీయ జనులనుచూచి వారితో నిట్లనియె, యెన్నాళ్ళమట్టుకు మీరు రెండు యభిప్రాయములు పెట్టుకొని యుందురు. యెహోవ దేవుడైతే ఆయనను యనుసరించుడి. బయలు దేవుడైతే వాని ననుసరించుడని ప్రకటన చేయగా వారతని కొకమాటయైనను ప్రత్యుత్తరమియ్యక పోయిరి. అప్పుడు యేలీయ యిట్లనెను.

మీరు రెండుయెడ్లను ఏర్పరచుకొని వాటిలో ఒకదాని మీరు తునకలుగాచేసి క్రింద అగ్నియేమియూ వేయకుండనే బయలుయొక్క బలిపీఠముమీద నుంచవలెను. రెండవయెద్దును నేను సిద్ధముగా చేసి యెహోవయొక్క బలిపీఠముమీద నుంచెదను. తరువాత మీరు మీ దేవత పేరునుబట్టిప్రార్థనచేయుడి. నేనైతే యెహోవ పేరునుబట్టి ప్రార్థనచేయుదును. ఏ దేవుడు అర్పితములను తగలబెట్టుటచే ప్రత్యుత్తరమిచ్చునో ఆయనే దేవుడనినిశ్చయించుదము నం

డు. దానికి ప్రజలు సమ్మతించిరి. బయలు ప్రవక్తలు తమ యెద్దును సిద్ధముగా చేసి బలిపీఠము మీద వేసి యుదయము మొదలుకొని మధ్యాహ్నము వరకు బయలు పేరును స్మరించుచు గంతులు వేయుచు బయలూ, బయలూ మా ప్రార్థన వినుమని ప్రార్థించిరి గాని ప్రత్యుత్తరము వారికి రాక పోయెను. అప్పుడు ఏలీయా తన యెద్దును సిద్ధముగా జేసి బలిపీఠము మీదనుంచి యెహోవా పేరును స్మరించుచుండగా అగ్ని దిగి బలిని దహించెను. ప్రజలు జరిగినది చూచుచు సాగిలపడుచు యెహోవా దేవుడు యెహోవా దేవుడు అని కేకలు వేసిరి. తరువాత ఏలీయా వెళ్ళి యెహోవా వర్షము పంపునట్లు ప్రార్థన చేసినప్పుడు విస్తారముగా వర్షము కురిసెను.

1 రాజు 17, 18.

## 4. నాబోతు యొక్క ద్రాక్షతోట.

(1) ఆహాబు యొక్క నగరును యానుకొనియున్న యొక ద్రాక్ష తోట ఇశ్రాయేలు వాడైన నాబోతునకు కలిగియుండెను. ఆహాబు యాతోటను కొనగోరెను గాని నాబోతు దానినతని కియ్యనొల్లక పోయెను.

(2) తాము దానిని స్వాధీన పరుచుకొనునట్లు ఆహాబును యెజబెలును నాబోతును చంపించిరి.

పిమ్మట ఏలీయా ఆహాబు యొద్దకు వచ్చి నీవు యతని ద్రాక్షతోటను స్వాధీన పరుచుకొనునట్లు నాబోతును చంపితివి గదా యే స్థలమునందు కుక్కలు నాబోతు యొక్క రక్తము నాకెనో యాస్థలమందు కుక్కలు నీ రక్తము నాకును. యెజబెలునున్ను అవి తినివేయునని యాతనితో చెప్పెను. కొన్ని సంవత్సరము లయిన తరువాత యట్లు జరిగెను.

1 రాజు. 21. 22.

## 5. ఏలీయా ఆరోహణమగుట.

యెహోవా సుడిగాలిచేత ఏలీయాను పరలోకమునకు ఆరోహణము చేయించబోవుకాలమున సంభవించినదేమనగా ఏలీయాప్రవక్తయైన ఎలీషాతోకూడ గిల్గాలునుండి వెళ్లెను. అప్పుడు ఏలీయా ఎలీషాతో నిట్లనియె. యెహోవా నన్ను బేతేలుకు వెళ్ళుమనెను. నీవు దయచేసి యిచ్చటనుండుమని చెప్పినప్పుడు ఎలీషా యెహోవా జీవముతోడు నీజీవముతోడు నేనునిన్ను విడువనని ప్రత్యుత్తరమిచ్చెను. కాబట్టి వారిద్దరు బేతేలుకు వెళ్లిరి. బేతేలులోనున్న దీర్ఘదర్శులయొక్క శిష్యులు ఎలీషాయొద్దకువచ్చి నేటిదినము యెహోవానీ గురువును తీసుకొనిపోవునన్న సంగతి నీవు ఎరుగుదువాయని పలికినప్పుడతడు నేనెరుగుదును. మీరు ఊరకుండుడని చెప్పెను. అంతట ఏలీయా ఎలీషాతో మరలనిట్లనెను.

దయచేసి యిక్కడ నుండుము. ఏలనగా యెహోవా నన్ను యెరికోకు వెళ్ళుమనెనని చెప్పినప్పుడు అతడు యెహోవా జీవముతోడు నీజీవముతోడు నేనునిన్ను విడువనని చెప్పెను. కాబట్టి వారిద్దరు యెరికోకు వచ్చిరి. అచ్చటనుండి వారిద్దరు యొర్దానునది దగ్గరకు వెళ్ళిరి. అంతట ఏలీయా తనదుప్పటి తీసికొని మడతబెట్టి యుదకములమీద కొట్టినప్పుడవి యివతలకును అవతలకును విభజనెనందున వారిద్దరు పొడినేలమీద దాటివెళ్ళిరి.

వారు దాటివెళ్లినతరువాత సంభవించినదేమనిన ఏలీయా ఎలీషాను చూచి నేనునీయొద్దనుండి తీయబడుటకు మునుపు నావల్ల నీకేమికావలసియున్నదో దానినడుగుమని చెప్పినప్పుడు ఎలీషా నిట్లనెను. నీకు

కలిగిన యాత్మలో రెండంతలు నామీదనుండనిమ్మని ప్రార్థించెను.

అందుకతడు నీవుఅడిగినది కష్టతరముగానున్నది. అయితే నీ యొద్దనుండి నేను తీయబడునప్పుడు నీవునన్ను చూచినయెడల యాప్రకారము నీకు ప్రాప్తమగునని చెప్పెను.

వారు యింకావెళ్ళుచు మాటలాడుచుండగా యగ్నిరథమును యగ్నిగుర్రములును కనబడి వీరిద్దరిని విభజనచేసెను. అప్పుడు ఏలీయా యారథమునెక్కి సుడిగాలిచేత పరలోకమునకు కొంచుపోబడెను. ఎలీషా యదిచూచి కేకవేసినదేమనగా! ఓనాతండ్రీ! నా తండ్రీ! యిశ్రాయేలుయొక్క రథమును, రౌతులును, యనిపలికెను. మరియు ఎలీషా ఏలీయాను మరలచూడకయుండెను.

2 రాజు. 2.

## 6. ఎలీషాను నయమానును గురించి.

అరాము రాజుకు సైన్యాధిపతియైన నయమాను యను పేరుగల యుద్ధవీరు డొకడుండెను. దేవుడితని మూలముగా అరాముదేశమునకు విజయము కలుగచేసెను. గనుక యీయన తనయజమానుని దృష్టికిఘనుడై దయపొందినవాడుగా నుండెను. అయితే యతడు కుష్టిరోగి. మరియు యాదినములలో యిశ్రాయేలీయులనుండి అరామీయులవలన చెరపట్టబడి తేబడిన యొకచిన్నది నయమాను భార్యకు యుపచారము చేయుచు నా మెతో నాయజమానుడు నా స్వదేశములోనుండిన ప్రవక్తయగు ఎలీషాయొద్దకు వెళ్ళినయెడల తన కుష్టరోగమునుండి శుద్ధుడవునని తెలియపర్చగా నయమాను యా

మాటలునమ్మి తనపరివారముతో వెళ్ళి ఎలీషాదగ్గరకు వచ్చెను.

ఎలీషా నయమానును చూచి అతనితో యిట్లనెను:—నీవు యొర్దానునదిలోకివెళ్ళి ఏడుమార్లు స్నానముచేసిన పక్షమున నీకుస్వస్థత కలుగును.

నయమాను యీలాగుచేసి బాగుపొంది యిశ్రాయేలు దేవుడు సత్యదేవుడని ఒప్పుకొనుచు కృతజ్ఞతగల హృదయుడై తన దేశమునకు సాగిపోయెను.

2 రాజు. 5.

7. యోనాయను ప్రవక్త.

ఎలీషాకు తరువాత కొన్ని సంవత్సరములకు అమిత్తయి కుమారుడైన యోనాయొద్దకి వచ్చిన దేవునిఆజ్ఞాయేమనగానీవులేచినినెవే యను నే మహాపురమునకు వెళ్ళి దానినిగురించి ప్రకటనజేయుము. యేలనవగా వారిదోషములు నాసన్నిధికి యెక్కియున్నవనెను. అయితే యోనా దేవుని యాజ్ఞప్రకారముగా జరిగించక వేరొకస్థలమునకు ఓడమీదప్రయాణము జేయుచుండగా దేవుడతని మార్గమందు సముద్రములో నడ్డగించి యాతనిని యొకచేప మ్రింగునట్లుగా నిర్ణాయించెను. యోనా మూడు దివారాత్రులు మత్స్యగర్భమునందుండిన తరువాత దేవుడు అతనిబైటికి రప్పించినందున ఆయన తిరిగి నినెవేమహాపురమునకు వెళ్ళి ప్రకటించెను. ఆపట్టణములో నివసించిన ప్రజలందరును నుపవాసముతో తమపాపములు ఒప్పుని దేవుని తట్టుకు తిరిగినందున దేవుడు యీపట్టణస్తులకు చేయదలచిన కీడును చేయకపోయెను. యోనాగ్రంథము.

## 8. ఇశ్రాయేలు చెరలోకి వెళ్లుట. (క్రీ. ము. 721)

(1) రాజగు యరొబాము విగ్రహారాధనకు ముఖ్య కారకుడై తన చేతిక్రిందనుండు ప్రజలగు యిశ్రాయేలీయులు తమ దేవుని మీద తిరుగబడునట్లుగాచేసి వారిని ఘోరమైన పాపస్థితికి దిగిపోవునట్లుగా ప్రేరేపణచేసిన వాడాయెను. అతనికి తరువాత సింహాసనమునకు వచ్చిన రాజులందరు అతని క్రియలను యనుసరించుచు పోతపోసిన దూడలను రాళ్ళను, చెట్లను, సూర్య చంద్ర నక్షత్రములను పూజించుచు తమ కుమారులను కుమార్తెలను యగ్నిహోత్రములో నడిపించి శకునములను చిల్లంగితనమును వాడుక చేయుచు యెహోవ దృష్టికి చెడుతనము చేయుటకై తమ్ము తాము యమ్ముకొని యుండిరి.

(2) ఈకారణమునుబట్టి దేవుడు యీఅక్రమభరితమైన జనాంగమునన్ను వారిరాజగుహోషేయ నున్ను అష్షూరియ దేశపురాజైన షల్మనేస్సరుకు అప్పగించెను. అతడు వారినిచెరగా పట్టుకొని తనదేశములోనికి వారిని తీసికొని వెళ్ళెను. ఆ చెరనుండి యీ పది గోత్రములు తిరిగి రాలేదు. షల్మనస్సరు సమరియయనే ప్రదేశమందు అన్యులయినవారిని కాపురము చేయనిచ్చెను.

ఆ అన్యులయినవారు యిశ్రాయేలీయులలో శేషించబడి సమరియలో నివశించినవారితో కలిసియుండిరి. అట్లు కలిసిన వీరు సమరీయు లనబడిరి.

2 రాజు 17.

9. ఇశ్రాయేలు రాజ్యమును తరుచుగా పరిపాలించిన రాజులు:—

| | | | | |
|---|---|---|---|---|
| 1. | యారోబాము I | 975 | క్రీ. | పూ. |
| 2. | నాదాబు | 954 | ,, | ,, |
| 3. | యెషా | 953 | ,, | ,, |
| 4. | ఏలా | 930 | ,, | ,, |
| 5. | జిమ్రి | 929 | ,, | ,, |
| 6. | ఒమ్రి | 929 | ,, | ,, |
| 7. | ఆహాబు | 918 | ,, | ,, |
| 8. | అహజ్యా | 897 | ,, | ,, |
| 9. | యెహోరాము | 896 | ,, | ,, |
| 10. | యెహూ | 884 | ,, | ,, |
| 11. | యెహోయహాజు | 856 | ,, | ,, |
| 12. | యెహోయాజు | 839 | ,, | ,, |
| 13. | యారోబాము II | 825 | ,, | ,, |
| 14. | జకర్యా | 772 | ,, | ,, |
| 15. | సల్లూము | 772 | ,, | ,, |
| 16. | మినహేము | 771 | ,, | ,, |
| 17. | పెకహ్యా | 761 | ,, | ,, |
| 18. | పెకా | 759 | ,, | ,, |
| 19. | హోషేయ | 730 | ,, | ,, |
| సమరియ నాశనము | | 721 | ,, | ,, |

## యూదారాజ్యము—దక్షిణరాజ్యము.

### 1. యెషయా అనేప్రవక్త యెహోవవలన పిలువబడుట.

(1) రాజగు రెహబాము తనతండ్రియైన సొలోమోనుకు తరువాత ప్రభుత్వము చేసినవాడై యెహోవ మార్గమునుండి తొలగి విగ్రహారాధనము క్రమక్రమముగా స్థాపించెను.

అతనికి తరువాత యూదారాజ్యము యేలినవారిలో కొందరుతప్ప తక్కినవారందరు దుర్మార్గప్రవృత్తియందు జీవించినవారై యుండిరి. అయినప్పటికి వారిపితృడగు దావీదునుబట్టి దేవుడు వారినిసహించుచువచ్చెను.

(2) దేవుడు వారిని తమ పాపస్థితినుండి మరలించుటకై తనప్రవక్తలయిన వారిని వారియొద్దకు పంపెను. ఆప్రవక్తలలో యెషయ్యా అనువాడొకడు. ఉన్నతమైన సింహాసనమందు దేవాలయములో అతడు యెహోవ కూర్చుండుట చూచెను. ఆయనపైని సెరాపులను దూతలునిలిచి సేనల యెహోవపరిశుద్ధుడు, పరిశుద్ధుడు, పరిశుద్ధుడు, సర్వలోకము ఆయన మహిమతో నిండియున్నదని కేకలువేసిరి. దేవాలయముయొక్క పునాదులు కదిలెను. అప్పుడు యెషయా—అయ్యయ్యో! నేనుఅపవిత్రమైన పెదవులుగల మనుష్యుడను గనుకను అపవిత్రమైన పెదవులుగల జనులమధ్యను నివసించు

[illegible]న్నాను గనుకను నేను నశించియున్నాను. రాజైన సేనల యెహోవను చూచితిననెను. అంతట యా సెరాపులలో నొకడు వేదికమీదనుండి నిప్పును చేత పట్టుకొని యతనియొద్దకు ఎగిరివచ్చి అతని నోటికి తగిలించి—చూడుము యిది నీ పెదవులకు తగిలెను నీయక్రమము తొలగిపోయెను నీపాపమునకు ప్రాయశ్చిత్తమాయెను. తరువాత యెషయ్యా నేను ఎవనిపంపెదను. యెవడు వెళ్ళునని ప్రభువు శబ్దము పలుకుట వినెను. అందుకు యెషయ్యా నేనున్నాను, నన్ను పంపుమని ప్రత్యుత్తర మిచ్చినప్పుడు యూదాదేశము బీడుపడునట్లును ప్రజలు చెరపట్టబడి బాబెలనే అన్యదేశమునకు తీసికొని పోవునట్లును సంభవించునని ముందుగా చెప్పుటకై యెహోవ అతనికి సెలవిచ్చెను.

యెషయ్యా 6.

## 2. అహాజున్ను యెషయ్యాయున్ను.

(1) పవిత్రుడైన యెషయ్యా కాలమందు యూదా రాజప్రభుత్వము అహాజు యనువాడు చేయుచువచ్చెను. అతడు బయల దేవతలకు ప్రతిమలను రూపించి మొలోకను దేవతను పూజించి దానికి తనకుమారుని ఆరోహణముగా సమర్పించెను. అతడు యెరూషలేములో నున్న పరిశుద్ధమందిరమునకు ప్రజలు పోకుండ దాని తలుపులు మూసివేసి మందిరముయొక్క యుపకరణములన్ని పగలగొట్టి యెరూషలేములో అన్యదేవతలకు అనేక వేదికలను కట్టించి బింబోపాసనమువలన ప్రజలను భ్రష్టులయ్యేటట్టుగా చేసెను.

(2) అట్లుండగా యెషయ్యా వారిని గద్దించుచు వచ్చెను. మ

రియు యెషయా ప్రవచించి పలికినదేమనగా:—

చీకటిలో నడుచు జనులు గొప్ప వెలుగును చూచుచున్నారు మరణచ్ఛాయగల దేశనివాసులమీద వెలుగు ప్రకాశించును ఏలయనగా మనకు పిల్లపుట్టెను. మనకు కుమారుడు యనుగ్రహించబడెను. ఆయన భుజములమీద రాజ్యభారముండును. ఆశ్చర్యకరుడు ఆలోచనకర్త, శక్తిమంతుడైన దేవుడు, నిత్యుడగు, తండ్రి, సమాధానకర్తయగు యధిపతియని యతనికి పేరుపెట్టబడును.

2 దినవృత్తా. 28. యెషయా 9.

## హిజ్కియ, యెషయా, మీకాఖా అనేవారిని గురించి.

(1) రాజగు ఆహాజు చనిపోయిన తరువాత అతని కుమారుడైన హిజ్కియా రాజపాలనము చేసినవాడాయెను. అతడు మంచి ప్రవర్తనగలవాడై తనతండ్రి కట్టించిన దేవతాస్తంభములను బలిపీఠములను పడద్రోసి యెహోవ మందిరములో ఆరాధన మర్లస్థాపించెను. అతని యేలుబడిలో సన్హేరీబు అనే అష్షూరియ దేశపు రాజు తనసేనలను కూర్చుకొని యెరూషలేము మీదికివచ్చినందున హిజ్కియాభయపడి దేవాలయమున ప్రవేశించి ప్రార్థనచేయుచుండగా దేవదూత అష్షూరీయుల దండులో వచ్చి వారిలో 185000

మందిని హతము చేసెను. అంతట సన్హెరీబు అపజయము నొంది తన దేశమునకు తిరిగి వెళ్ళెను.

(2) తరువాత హిజ్కియాకు మరణకరమైనరోగము కలుగగా ప్రవక్తయైన యెషయా అతనియొద్దకువచ్చి అతనితో:
నీయింటిని గూర్చి నిర్ణయము జేసికొనుము ఏలననగా
నీవు బ్రదుకక మరణమగుదువని యెహోవా ప్రమాణమిచ్చె ననిచెప్పెను.

అప్పుడు హిజ్కియా యెహోవను ప్రార్థన చేసినదేమనగా: ఓ యెహోవా, నేను యథార్థముగానుమనఃపూర్తిగాను నీముందరనడచి నీదృష్టికి ఏదిమంచిదో దాని నేను చేసితిని నాయందు జ్ఞాపకముంచి దయచేయుమని కన్నీళ్ళతో వేడుకొనినప్పుడు యెహోవ యొక్క వాక్యము యెషయాకు వచ్చినదేమనగా: నీవు హిజ్కియాయొద్దకువెళ్ళి యతనితో నిట్లని చెప్పుము—దేవుడైన యెహోవ నీకు యిచ్చిన సెలవు ఏమనగా నీప్రార్థన నేనువింటిని నేను నిన్ను బాగుచేసెదను—నీదినములింక పదిహేను సంవత్సరములుండునట్లుచేసెదను.

(3) బాబెలురాజు హిజ్కియా రోగియైయుండిన సంగతి వినినప్పుడతడు ఉత్తరములను కానుకలను అతనికి పంపెను. అప్పుడు హిజ్కియా తనయింటిలోనున్న సమస్తమును యా వార్తాహరులకు చూపించెను. అది దేవుడు మెచ్చలేదు గనుకాయన యెషయా మూలముగా హిజ్కియాతో పలికినదేమనగా:— వచ్చుదినముల

లో ఏమియుమిలగకుండ నీనగరునందున్న సమస్తమును నేటివరకు నీపితరులు సమకూర్చి దాచిపెట్టినదంతయును బాబెలు పట్టణమునకు ఎత్తుకొనిపోబడును. నీగర్భమందు పుట్టిన నీపుత్రసంతును బాబెలురాజు నగరునందు నపుంసకులుగా చేయబడుదురు. మరియు యూదులు బాబెలు చెరనుండి విడిపింపబడి తమ దేశమునకు తిరిగివత్తురని యెషయ్యా ముందుగా చెప్పెను.

(4) విమోచనకర్తయగు యేసునుగురించియెషయ్యాయిట్లనెను:
నిశ్చయముగా అతడు మనరోగములను భరించెను, మనవ్యసనములను వహించెను, అయినను మొత్తబడినవానిగాను దేవునివలన బాధింపబడిన వానిగాను శ్రమనొందిన వానిగాను మనమతని యెంచితిమి. మనయతిక్రమములనుబట్టి అతడు గాయపరచబడెను. మనదోషములనుబట్టి నలుగగొట్టబడెను. మనసమాధానార్థమైన శిక్ష యతనిమీదపడెను.

(5) ప్రవక్తయయిన మీకా యెషయ్యాతోడ సమకాలపు ప్రవక్త. ఆయన యేసుక్రీస్తుయొక్క పుట్టుకముందుచెప్పినదెట్లనగా బెత్లెహేమా, యిశ్రాయేలీయుల నేలేవాడు నీలోనుండి ఒకడు లేచును. ఆయన ఉత్పాదిల్లు గతించిన యుగములనుండికలిగిఉండెను.

2 రాజు. 18—20. యెష. 53. మీకా 5

## 4. యోషీయా అనే రాజున్ను హిల్కీయ అను ప్రవక్తయున్ను

(1) హిజ్కియా మరణమయిన పిమ్మట ఆయనకుమారుడైన మనష్షే రాజ్యాధికారిగ అతడు రాజ్యమునకు వచ్చినవాడా యెను.

అతడు మందిరములో దేవతా స్తంభములను కట్టించి కీడు చేసినవాడు. హిజ్కియాకు తరువాత పరిపాలించిన అతనికుమారుడగుఆమోను అతనిబోలినదుర్మార్గుడే.

(2) ఆమోనుకు పిమ్మట యోషీయ యను భయభక్తిగల రాజు ప్రభుత్వము చేయుచుండెను. అతడు బాల్యమునుండి పూర్ణమనస్సుతో యెహోవాను వెదకినవాడు. అతడు బయలుదేవతల బలిపీఠములను పడగొట్టి వాటిమీదనున్న సూర్యదేవతా విగ్రహములను నరికివేసి దేవతాస్తంభములను చెక్కిన విగ్రహములను పోతవిగ్రహములను ముక్కలుగా కొట్టి చూర్ణముచేసి వాటికి బలులనర్పించిన వారియొక్క సమాధులమీద చల్లివేసి దేవతల యాజకుల శల్యములను బలిపీఠములమీద అతడు కాల్పించి యూదాదేశమును యెరూషలేమును బాగా పవిత్రపరిచెను.

అతడు మందిరమును బాగుచేయుచుండగా ధర్మశాస్త్రముగల గ్రంథము దొరికెను. అప్పుడు రాజు ప్రజలందరిని మందిరములో పోగుచేసి వారికి ఆ ధర్మశాస్త్రము వినిపించెను. అంతట ప్రజలు తాము యెహోవా ననుసరించి సేవించెదమని నిబంధనచేసిరి.

(3) ఆకాలమందు హిల్కీయా రాజుకు సహాయముగావచ్చి

యెహోవమార్గమునకు తిరిగివచ్చుటకై మనుష్యులను ప్రేరేపించెను.

2 దినవృత్తా. 33—35. ఇర్మీ. 4.

5. యూదారాజ్యము లయపరచబడుటయును యూదులు బాబేలుకు చెరపట్టుకొని పోబడుటయును: క్రీ. పూ. 606 మొదలుకొని క్రీ. పూ. 536 వరకు 70 సంవత్సరములు చెరలోనుండుట.

యోషియ ఐగుప్తుదేశముమీద దండెత్తివచ్చి మెగిద్దోయనే మయిదానమందు కూలినందున యూదాదేశము ఐగుప్తుదేశమునకు లోబడెను. తరువాత కర్కెమిష్ అను పురముదగ్గిర బాబెలురాజగు నెబుకద్నెసరు నేకో యనే ఐగుప్తురాజును జయించెను. (క్రీ. పూ. 606.) అప్పటినుండి కల్దీయులు యూదులను చెరపట్టిరి.

(1) యెహోయకీముయేలుబడియొక్క మూడవసంవత్సరమున పెక్కండ్రు యూదులు బాబెలుకు తీసుకపోబడిరి.

దానియేలు 1. 1—2 రాజు. 24. 1.

(2) అతనియేలుబడియొక్క పదకొండవ సంవత్సరమున కల్దీయులు మరల కొందరిని చెరబట్టిరి.

2 దినవృత్తా. 36. 5—8.

(3) యెహోయాకీము కుమారుడగు యెహోయాకీనుయొక్క యేలుబడిలో ననేకమందిని చెరబట్టిరి. రాజగు యెహోయాకీను సహితము అపరాధముగా దీసుకపోబడెను.

2 రాజు. 24. ఇర్మీ 52. 28.

(4) సిద్కియా అను రాజు ఏలుబడియొక్క పదునొండవ సంవత్సరమున యూదులు నాల్గవసారి దేశాంతరముగా వెళ్ళునట్లు తటస్థించెను క్రీ. ము. 585 అప్పుడు కల్దీయుల సేనలువచ్చి

మందిరోపకరణములన్నిటిని మందిరములోని ద్రవ్యమంతయును తీసుకొని మందిరమును తగలబెట్టి యెరూషలేముయొక్క ప్రాకారమును పడగొట్టి వానియొక్క నగరములన్నియు దహింపజేసి దానిలోని ప్రశస్తమైన వస్తువులన్ని బొత్తిగాపాడుచేసి జనులలో గొందరిని చంపి గొందరిని చెరపట్టుకొని పోయిరి.

2 రాజు 25. 2 దినవృత్తా. 36. ఇర్మి. 52. 27.

(5) అయిదు సంవత్సరములయిన తరువాత కల్దీయులు మరల వచ్చి కొందరు బీదజనుల తప్ప శేషించిన వారందరిని చెరపట్టిరి.

2. రాజు 25. 12.

దేవుని దీర్ఘదర్శియయిన ఇర్మీయ చెరకుపోక యెరూషలేములో నివసించి ప్రజలకు తగిలిన దురవస్థనుబట్టి బహు చింతాక్రాంతుడై విలాపవాక్యములను వ్రాసి డెబ్బైసంవత్సరములయిన తరువాత ప్రజలు బాబెలునుండి విడిపింపబడి తమదేశమునకు తిరిగి వత్తురని

ముందు చెప్పుచువచ్చెను.

ఇర్మీ. 25.

6. యూదా రాజ్యమును తరుచుగా నేలిన రాజులు:

| | | | |
|---|---|---|---|
| (1) రెహబియాము | 975 | క్రీ. | ము. |
| (2) అబియా | 958 | ,, | ,, |
| (3) ఆసా | 955 | ,, | ,, |
| (4) యెహోషఫరు | 914 | ,, | ,, |
| (5) యూరాము | 889 | ,, | ,, |
| (7) అహస్యా (అత్తల్యారాణి) | 885 | ,, | ,, |
| (7) యూయాసు | 878 | ,, | ,, |
| (8) అమజ్యా | 838 | ,, | ,, |
| (9) ఉస్సీయ(అసర్యా వేరొక పేరు) | 810 | ,, | ,, |
| (10) యూతాము | 758 | ,, | ,, |
| (11) అహాజు | 742 | ,, | ,, |
| (12) హిజ్కియా | 726 | ,, | ,, |
| (13) మనస్సె | 697 | ,, | ,, |
| (14) ఆమోను | 642 | ,, | ,, |
| (15) యూషీయా | 640 | ,, | ,, |
| (16) యూయహాసు | 610 | ,, | ,, |
| (17) యూయకీము | 609 | ,, | ,, |
| (18) యెహోయకీను | 599 | ,, | ,, |
| (19) జిదకీయా | 599_588 | ,, | ,, |
| యెరూషలేముయొక్క నాశనము క్రీ. ము. | 588 | ,, | ,, |

# III.

## యూదులు చెరలోనుండు కాలమును, మరలతమ దేశమునకు తిరిగి వచ్చుటను

### యెహెజ్కేలునున్ను దానియేలునున్ను

(1) చెరలోకి తీసుకపోబడినవారిలో యెహోవయొక్క దీర్ఘదర్శులయిన యెహెజ్కేలునున్ను దానియేలునున్ను. బాబెలులో ప్రజలను ఆదరించుచు రాబోవు మెస్సీయా అనగా క్రీస్తునను లోకరక్షకునిగురించి ముందుచెప్పినవారు.

(2) దానియేలు బాబెలుకు తీసుకపోబడినప్పుడు యాతడు యౌవనస్థుడు. అతడు ప్రజ్ఞావంతుడగుటచే యాదేశములో మిగుల ఘనతవహించెను. రాజు తన సన్నిధినతనినుంచి బహుగా మన్నించి బాబెలు సంస్థానమంతటిమీద యధిపతినిగాను బాబెలు జ్ఞానులందరిలోను ప్రధానునిగాను నిర్ణయించెను. గనుక ప్రధానులున్ను యధిపతులున్ను యాతని విషయమై మాత్సర్యము వహించినవారై రాజ్యపాలనవిషయములో ఏదయిన నొక నిందదానియేలుమీద మోపదలచి కారణముకొరకు కనిపెట్టుకొనియుండిరి. గాని దానియేలు నమ్మకస్థుడయి ఏనేరమైనను ఏతప్పైనను జేయువాడుగాకుండెను. గనుక వారు అతనియందు ఏ లోపమయినను కనుగొనలేకపోయిరి. ఉదయ మధ్యాహ్న సాయంత్రములందు దానియేలు యెహోవాను ప్రార్థించువాడని వారికి తెలిసియున్నం

మన వారు రాజాయొద్దకు సందడిగా కూడివచ్చి ముప్పది దినముల ప
ర్యంతము రాజా నీవు దక్క మరియే దేవునియొద్దనయినను మానవునియొద్ద
నయినను ఎవడయినను ఏప్రార్థన చేయకూడదు. ఎవడయినను చేసి
నయెడల వాడు సింహములుండు గుహలో పడద్రోయ బడవలెనని
రాజు ఆజ్ఞయిచ్చునట్లు మనవిచేసియుండిరి. రాజు వారుచేసిన మ
నవి యాలకించి యట్లు ఆజ్ఞ యిచ్చెను. అయినప్పటికి దానియేలు
అంతకుముందు యెట్లుప్రార్థనచేయుచుండెనో యట్లే ప్రార్థనజరు
పుచువచ్చెను. అప్పుడువారు రాజాయొద్దకువచ్చి చెరపట్టబడిన
యూదులలోనున్న దానియేలు నిన్నైగాని నీవుపుట్టించిన శాసన
మునైగాని లక్ష్యపెట్టక యనుదినము ముమ్మారు తనదేవునికి ప్రా
ర్థనచెల్లించుచు వచ్చుచున్నాడనిరి. రాజు యీమాటవిని బహు
గా వ్యాకులపడి దానియేలును రక్షింపవలెనని నుద్దేశించెను. వా
రు దీనిచూచి రాజుసన్నిధిలోనికివచ్చి రాజా, రాజు స్థిరపరిచిన
యేశాసనముగాని తీర్మానముగాని యెవడును రద్దుపరచజాలడు
ఇది మాదీయులకును పెర్సీయులకును విధియని తమరు తెలిసికొన
వలెననిరి.

అంతట రాజు ఆజ్ఞనివ్వగా దానియేలు సింహముల గుహలో
ద్రోసివేయబడెను. పడద్రోయబడగా రాజు దానియేలుతో
నీవు యనుదినము తప్పక సేవించుచున్న నీ దేవుడే నిన్ను రక్షించు
గాకని చెప్పెను.

మరునాటి తెల్లవారిజామున రాజు [illegible] లేచి సింహముల గు
హాదగ్గరకు త్వరగాపోయి దానియేలును పిలిచి జీవముగల దేవుని

సేవకుడవయిన దానియేలూ నిత్యము నీవు సేవించుచున్న నీదేవు డునిన్ను రక్షింపగలిగెనాయని నతని నడుగగా దానియేలు దేవు డు తనదూతనంపించి సింహములు నాకే హానియు జేయకుండ వా టినోళ్లు మూయించెనని ప్రత్యుత్తరమిచ్చెను. రాజు యిందును గూర్చి యతిసంతోషముగలవాడై దానియేలును బయిటికిదీయుండ ని తనసేవకుల కాజ్ఞయివ్వగా వారతని వెలుపరించిరి. తరువాత రాజు తన రాజ్యములోని సకలప్రభుత్వములందుండు నివాసులు దానియేలుయొక్క దేవునియందు భయభక్తులుంచవలెనని ఆజ్ఞ ఇచ్చెను.

(3) యెహేజ్కేలుగాని దానియేలుగాని చెరనుండి తిరిగిరాక బాబెలులో మృతిబొందిరి.

* దానియేలు. 1—6: యెహెజ్కేలు 35:

## 2

## చెర విముక్తులైవచ్చుట.

(1) యూదులు చెరబట్టబడిన డెబ్బది సంవత్సరములకు పెర్సి యదేశపు రాజగు కోరేషు బాబెలను పట్టణము పట్టి యూదుల యందు దయాంతఃకరణముగలవాడై యుండి నెబుకద్నెసరు బాబె లుకు దోచుకొనిపోయిన దేవాలయపు సామానులుసర్వమును వారి కప్పగించి యాసామానులతోసహా వారు తమదేశమునకు వెళ్ల నెల వొసంగెను. రాజానుమతిగైకొని శతాధిపతియగు జెరుబ్బాబెలు క్రింద ఏబదివేలమంది తమ స్వదేశమునకు ప్రయాణము చేసిరి. ( క్రి. ము. 536. )

ఆయూదులు బాబెలునుండి మరలివచ్చి దేవునిమందిరము పునః కట్టుబడి నారంభించిరి. సమరీయులు యీసంగతివిని సంతోష స్వాంతులై తాముకు నందు సేకీభవింప గోరిమనవిజేసిరిగాని యది యూదులనెంతమాత్రము మెప్పించినదిగాక నొప్పించినదయ్యెను. అందుచే పదునాలుగు సంవత్సరములు యూదుల ప్రయత్నమునకు మితిలేనియంతరాయములు కలిగించుచునచ్చిరి.

అప్పుడు దేవుని దీర్ఘదర్శులైన హగ్గయి జెకర్యా అను వారు ప్రసంగించుచు వచ్చిరి. అందులో మందిరమును గట్టించుటకై హగ్గయి వారిని ప్రేరేపించి నూతనమందిరముయొక్క మహిమ మునుపటిమందిరపు దానిని మించుననియు అచ్చట దేవుడు సమాధానము నిలుప ననుగ్రహించుననియు ప్రవచించెను. జెకర్యా మెస్సీయయొక్క రాకను తెలుపుచు వ్రాసినదేమనగా:—

యెరూషలేము నివాసులారా! ఉల్లాసముతో నుండుడు. నీరాజు నీతిపరుడును రక్షణగలవాడును దీనుడునై గార్దభమును గార్దభపుపిల్లను ఎక్కి నీయొద్దకు వచ్చుచున్నాడు.

రాజగు కోరెషు ఆమందిరనిర్మాణమునకు వలయు సహాయమంతయుజేసి నాలుగుసంవత్సరములు యూదులతోగలసి పనిజేసెను.

(2) డెబ్బదియొనిమిది సంవత్సరములు గడచినపిమ్మట (458-57. పూ.) ఎజ్రాఅను శాస్త్రియొకడు చెరబట్టబడినవారిలో గొందరిని దీసికొని యెరూషలేమునకు ప్రయాణమైవచ్చెను.

(3) రాజుచే యెరూషలేమునుండి బాబెలునకు తేబడి వారియొం

ట బానదాయకునిగా యుంచబడిన నెహేమ్యా అనువాడొక డుండెను. యెరూషలేముయొక్క ప్రాకారములు బ్రాగుచేయ బ డనిమాట యతనిచెవి సోకగానే కడుదుఃఖించి యుపవాసముతోను కన్నీళ్లతోను దేవుని బ్రార్థించెను. అంతట రాజు వాటినిబాగుచేయునిమిత్తము యెరూషలేముకు అతనిపంపెను; యూదులుగొందరు అతనితో గలిసివెళ్ళిరి. (455. క్రీ. పూ.)

ఎజ్రా గ్రంథము.

నెహేమ్యాగ్రంథము.

౩.

## చెరనుండి విడుదలయైనపిమ్మట.

(1) పెర్సీయులు రమారమి రెండువందలు సంవత్సరములు యూదాదేశమును బాలించిరి.

(2) తరువాత మకదోనియ అను దేశపురాజగు మహా అలెగ్జాండరు పెర్సీయదేశపురాజును జయించి వతనిరాజ్యములోని సకలభ్రభుత్వములను వశపరుచుకొని యూదుల నేలుచు న చ్చెను. మహా అలెగ్జాండరు కాలధర్మము నొందినమీద అయిగుప్త్రు, సూరియ, మకదోనియ అనే మూడుభాగములుగా వతనిసేనాధిపతులయినవారు వతనిరాజ్యమును విభజించిరి. యూదులు అయిగుప్త్రురాజ్యమునకు లోబడినవారై జక్కగ చూడబడిరి. తాముకోరినరీతిగా యెహోవను గొలువ సెలవుబొందిరి.

(3) అనంతరము యూదులు సూరియా దేశపు రాజులకు లోబడగా యారాజులు వారినిక్రూరముగా చూచిరి. అందొకడు అంతియొకస్ ఇపిఫానిస్ యనువాడు. వాడు విగ్రహారాధనము జేయవలయునని నిర్బంధించి యందులకొడంబడని వారిని వధించెను.

(4) అక్కాలంబున యూదాదేశమందు మత్తతీయ యను పేరుగల యాజకుడొకడుండెను. ఆయన దేవునియారాధన పరుడైనందున కొందరుజనులను గూర్చికొని దేశంబులంగ్రిమ్మరియుండందు గానంబడు దేవతా స్తంభములు నన్య వేదికల గూల్చి విగ్రహారాధకుల నాగ్రహ గ్రస్తమానసులనుగాజేసి వారిచే బట్టుపడక తప్పించుక తిరుగవలసి వచ్చెను.

అతని యనంతర మాతని పుత్రుండగు యూదామక్కబీయు వొక సేననుగూర్చికొనిసూరియాదేశస్థులతో ఘోరయుద్ధంబుసలిపియెరూషలేమును పట్టుకొని మందిరము శుద్ధిపరచి యారాధనము మరల స్థాపించెను.

(5) మత్తతీయ సంతతివారు యూదాదేశమును సుమారు నూరేండ్లు పాలించిరి. అవల రోమీయులు దేశమును జయించి రాష్ట్రములనేల రాజులనేర్పర్చిరి. ఆరాజులలో మహా హేరోదు అనువాడు ఒకడు. అతనిఏలుబడిలో మహామహుండును లోకరక్షకుండగు యేసుక్రీస్తు యవతరించెను.

పెర్సియకింద 538—330 క్రీ. పూ.

2. మకదోని యగ్రీసుక్రింద 330—167 క్రీ. పు.
3. మక్కబీయులు గ్రీక పరిభుత్వము తప్పించునిమిత్తము పోరాడడము. క్రీ. పు.167_141.

4. మకబీయులేలుట. క్రీ. పు. 141—63

పుంపై అనేవాడు యెరూషలేము నాశనముచేయుట.

5. రోమీయులేలుట క్రీ. పు. 63—క్రీ. త. 70

4.

పాతనిబంధనలోని గ్రంథకర్తలగు దీర్ఘదర్శుల వంశకాలక్రమము.

1. క్రీ. పు. 759_698 యెషయ్యా
2. ,, ,, 627_587 యెర్మీయ
3. ,, ,, 595_575 యెహెజ్కేలు
4. ,, ,, 606_533 దానియేలు
5. ,, ,, 783_723 హోషేయ
6. ,, ,, 870— యోవేలు
7. ,, ,, 800— ఆమోసు
8. ,, ,, 892_885 ఓబద్యా
9. ,, ,, 825_784 యోనా
10. ,, ,, మీకా

యెషయ్యాతో సమకాలపువాడు

11. క్రీ. పూ. నహూము
ప్రజలు చెరకుపోకముందు నినివే నాశనము కాకముందు (625)
12. ,, ,, హబ్బకూకు
ఇర్మీయతో సమకాలపువాడు
13. ,, ,, 641-610 సెఫన్యా
14. ,, ,, 520— హగ్గయి } కుదురు
15. ,, ,, 520— జకర్యా } చాటుకాల
16. ,, ,, 416— మలాకీ } ప్రవక్తలు

5.

యేసుక్రీస్తు విషయమయి పాతనిబంధనలో వ్రాయబడినట్టియు నూతననిబంధనలో నెరవేరినట్టియు కొన్నిప్రవచనములీ క్రిందనీయబడినవి.

(1) ఆయన ప్రత్యేకస్త్రీ సంతానమవును.
(2) అబ్రాహముకిచ్చిన వాగ్దానము అబ్రాహామునకిచ్చుట.
(3) యూదాగోత్రమందు ద్భవమవును.
(4) దావీదు సంతతినుండిజన్మించును.
(5) ఆయన జననమొందుకాలము చెప్పబడెను.
(6) ఆయన పుట్టుతావు నిరూపింపబడెను.
(7) ఆయన కలుగురీతి విపులముగా చెప్పబడెను.
(8) ఆయన దైవమానుష స్వభావముగలవాడయి నెగడును.
(9) దరిద్రుడగును.
(10) తనస్వకీయులయిన వారివలన తృణీకరింపబడును

(11) పాపులనిమిత్తము పెక్కుహింసలనొంది తుదకుజంపబడును.

(12) ఆయన బట్టలకు చీట్లువేయుదురు.

(13) ఆయన యెముకలు విరుగగొట్టరు.

(14) ధనికుని సమాధినుంచబడును.

(15) అంతా సంభవించినను నాశనమొందక పునరుత్థానము పొందును.

(16) మహిమాస్పదమగు ఆయనరాజ్యమునుగురించిపలుకబడె.

(17) పరలోకగమనము. ఇంక అనేకములున్నవి.

పాతనిబంధనయందలి యీక్రింది వాక్యములు వాటికెదురుగా చూపిన క్రొత్తనిబంధన యందలి సంగతులతో బోల్చి వాటినిజమును గనిషించండి.

| 1. పాతనిబంధన | 2. క్రొత్తనిబంధన |
|---|---|
| (1) ఆది. 3. 15 | లూకా. 2. |
| (2) ఆదికాం. 49. 10. | లూకా. 2. |
| (3) యెషయ్యా. 9. 6. | మత్త. 1. |
| (4) మీకా. 5. 2. | మత్త. 2. 1. |
| (5) యెషయ్యా. 53. | యోహా. 1. 11. |
| (6) దానియేలు 9. 26. | మత్త. 27. |
| (7) కీర్తన. 16. 10. | యోహా. 20. 1. |
| (8) దానియేలు. 2. 44. | యోహా. 16. 38. |

ఇంక అనేకములున్నవి.

## 6.

## పాతనిబంధనలోని 39 గ్రంథములు.

| 1. పేర్లు | 2. అధ్యాయములు. |
|---|---|
| (1) ఆదికాండము | 50 |
| (2) నిర్గమకాండము | 40 |
| (3) లేవీయకాండము | 27 |
| (4) సంఖ్యాకాండము | 36 |
| (5) ద్వితీయోపదేశకాండము | 34 |
| (6) యెహోషువ | 24 |
| (7) న్యాయాధిపతులు | 21 |
| (8) రూతు | 4 |
| (9) 1 సమూయేలు | 31 |
| (10) 2 సమూయేలు | 24 |
| [11] 1 రాజులు | 22 |
| (12) 2 రాజులు | 25 |
| (13) 1 దినవృత్తాంతము | 29 |
| (14) 2 దినవృత్తాంతములు | 36 |
| (15) ఎజ్రా | 10 |
| (16) నెహెమ్యా | 13 |
| (17) ఎస్తేరు | 10 |
| (18) యోబు | 42 |
| (19) కీర్తనలు | 150 |

సమాప్తము.

---